# యజ్ఞములు

## (నిజమా-అబద్ధమా)











రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**







# యజ్ఞములు

## (నిజమా-అబద్ధమా)


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-41 ద్వితీయ ముద్రణ : ఏప్రిల్-2019

ప్రతులు : 1000 **వెల : 60/-**






**"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) ౧౦౦, శతము, 100
100) సుప్రసిద్ధి బోధ.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు



*(DVD'S)*

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.

88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము, 126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం, 131. బ్రహ్మవిద్య.
132. శక్తి, 133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం, 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ నా నెత్తిమీద
రెండు తన్నమ్మ.
146. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి.శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

యజ్ఞమను మాటను విననివారు ఎవరూ ఉండరు. యజ్ఞమును చేయడము దేవాలయములోనైనా, ఆశ్రమములోనైనా, మరెక్కడైనా కొందరు చూచియుందురు. కొందరు చూడనివారు కూడా ఉండవచ్చును. ఒక పుణ్యక్షేత్రములో నూరు యజ్ఞగుండములలో పురోహిత బ్రాహ్మణులు వేదమంత్రోచ్చాటనతో యజ్ఞములను చేయుచుండగా నేను కూడా చూచాను. యజ్ఞములు ఎలా చేయాలో బ్రాహ్మణులకు మాత్రము తెలుసు. చేయువారు బ్రాహ్మణులుకాగా, చేయుంచుకొనువారు ఎవరైనా ఉండవచ్చును. ఎవరికైనా ఏదైనా కోర్కె ఉన్నా, కొన్ని పనులు జరుగు నిమిత్తముగానీ, కొన్ని లాభములు వచ్చు నిమిత్తముగానీ, అనేక రకముల పనులు జరుగుటకు అనేక రకముల యజ్ఞములు చేయుదురని కొందరు చెప్పగా విన్నాము. ఆ నేపథ్యములో ఒక కుటుంబములో యుక్తవయస్సు వచ్చిన అమ్మాయికి పెళ్ళి సంబంధములు రాలేదనీ, పెళ్ళికి ఆలస్యమవుతున్నదనీ, ఒక జ్యోతిష్యున్ని అడిగితే "ఆ యువతికి కుజదోషమున్నది. అందువలన ఆలస్యమగుచున్నది. ఆలస్యము కాకుండా పెళ్ళి తొందరగా అగుటకు వివాహ యజ్ఞము చేసి ఆ పైన కుజ పూజ చేయవలెను" అని చెప్పాడు. అంతేకాక యజ్ఞమునకు మొత్తము 50 వేలు ఖర్చవుతుందనీ, 30 వేలు బ్రాహ్మణులకు, మిగతావి నెయ్యి మొదలగు వస్తువులకు 20 వేలు ఖర్చవుతుందని చెప్పగా, అమ్మాయి తల్లి తండ్రులు ఒప్పుకొని డబ్బు ఇవ్వగా వివాహ యజ్ఞము చేశారు. ఈ విధముగా మనుషులు తమ పనులు జరుగుటకు అనేక రకముల యజ్ఞములను చేయుట చూశాను. కొన్ని మనుషుల కోర్కెలు నెరవేరుటకు చేయబడు యజ్ఞములుకాగా, కొన్ని దేవతల ప్రీతికొరకు, దేవతలను తృప్తిపరచుటకు చేసెడి యజ్ఞములుగా ఉండేవి. మరికొన్ని యజ్ఞములు సమాజ శ్రేయస్సు కొరకు చేసెడివారు. సమాజము కొరకు విశ్వశాంతి యజ్ఞము, దేశశాంతి

యజ్ఞము అని పేర్లు పెట్టి చేసెడివారు. ఇట్లు ఏ పేరు పెట్టి ఏ రకము యజ్ఞము చేసినా, యజ్ఞగుండము ఒకే విధముగా ఉంటుంది, రుత్వికులు వారే ఉంటారు, మండించే అగ్ని ఒకటే ఉంటుంది. యజ్ఞములోనికి వేయు వస్తువులలో, చెప్పే మంత్రములలో కొంత మార్పు చేసియుందురేమో గానీ, మిగతావన్నీ ఒకే విధముగా ఉంటాయి.

కర్నూలు జిల్లాలో దేవతా ప్రతిమలను చేయు ఒక ఊరు ఉన్నది. అక్కడ శిల్పాచార్యులే కాకుండా మిగతా కులము వారు కూడ ప్రతిమలను చేసి అమ్ముచుందురు. మేము ఒక కృష్ణప్రతిమను అక్కడే కొన్నాము. ఆచారి కులము కాకుండా వేరు కులములోని వ్యక్తి మాకు పరిచయము ఉండుట వలన అతనితో కృష్ణప్రతిమను చేయించాము. కృష్ణ ప్రతిమను మేము అక్కడే రెండురోజులుండి చివరిలో పాలిష్ చేయించాము. ఉదయము నుండి సాయంకాలము వరకు ప్రతిమలు చేయు స్థలములోనే ఉండి అక్కడి పనిని చూచెడివాడిని. అక్కడ ఆడ దేవత బొమ్మ ఒకటుండెడిది. నేను అక్కడున్న సమయములోనే ఒక వ్యక్తి వచ్చి చౌడేశ్వరి ప్రతిమ కావాలి అని అడిగితే అక్కడి శిల్పాచార్యుడు, రడీగా ఉంది 15 వేలు ఇచ్చి తీసుకొని పొండి అని చెప్పాడు. వచ్చినవారు 10 వేలు ఇస్తానన్నారు. దానికి శిల్పా చార్యుడు ఇవ్వనని చెప్పాడు. రెండు గంటల తర్వాత మరియొక మనిషి వచ్చి పెద్దమ్మ ప్రతిమ కావాలన్నాడు. అప్పుడు అక్కడున్న శిల్పాచార్యుడు మొదటివానికి చూపిన బొమ్మనే చూపించి 15 వేలు రేటు చెప్పాడు. ఈ మారు వచ్చిన వ్యక్తి 9 వేలకు అడిగాడు. చివరకు బేరము కుదరలేదు. వచ్చినవాడు మరియొక చోటికి పోయాడు. తర్వాత కొంతసేపటికి మరి యొక వ్యక్తి వచ్చి రాజరాజేశ్వరిదేవి ప్రతిమ కావాలన్నాడు. అప్పుడు కూడా శిల్పాచార్యుడు వచ్చిన వానికి మొదట

ఇద్దరికి చూపిన ప్రతిమనే చూపాడు. అతనికి కూడా 15 వేల రేటునే చెప్పాడు. వచ్చిన వ్యక్తి ప్రతిమను చూచి ఒక వెయ్యి రూపాయలను తగ్గించుకొని ఇవ్వమన్నాడు. అప్పుడు శిల్పాచార్యుడు 14 వేల రేటుకు ఒప్పుకొని అతనికి ఆ ప్రతిమను ఇవ్వడము జరిగినది. ఇదంతయూ ఉదయము నుండి సాయంకాలము వరకు నా ముందరే జరిగింది.

అప్పుడు ఆ శిల్పాచార్యునితో నేను మాట్లాడుచు "ఉదయము నుండి ముగ్గురు వ్యక్తులు వచ్చి ఒకరు చౌడేశ్వరినీ, మరొకరు పెద్దమ్మనూ, ఇంకొకరు రాజరాజేశ్వరిని అడిగారు. నీవేమో ముగ్గురికీ ఒకే ప్రతిమను చూపి రేటు చెప్పావు. ముగ్గురు దేవతలను వారు అడిగినప్పుడు, వేరువేరుగానున్న దేవతా ప్రతిమలను చూపకుండా, ఒకే ప్రతిమను చూపడములో అర్థమేమిటి" అని అడిగాను. అప్పుడు అతడు ఈ విధముగా మాట్లాడుచు "మగ ప్రతిమలకు ప్రతి దానికి వేరువేరు ఆకారములు, వేరువేరు ఆయుధములు, వేరువేరు అలంకారములు ఉండును. ఉదాహరణకు విఘ్నేశ్వరునికి, వీరభద్రునికి, సుబ్రమణ్యస్వామికి ఆకారములువేరు, అలంకారములు వేరు, ఆయుధములు వేరైనదానివలన వారి ప్రతిమలను వేరువేరుగా తయారు చేయవలసిందే, ఇట్లు పురుష ప్రతిమలను ఒకదానితో మరొకటి పోల్చి చూపేదానికి కాదు. అదే ఆడ దేవత ప్రతిమల విషయములోనికి వస్తే, ఒక ప్రతిమను ఏ దేవతగానైనా పోల్చి చూపవచ్చును, ఎవరూ కాదనలేరు. ఒకే ఆడ ప్రతిమకు ఎన్ని పేర్లయినా పెట్టవచ్చును. ఏ దేవతగానైనా చూపవచ్చును." అన్నాడు. అ శిల్పాచార్యుని మాటవిన్న తర్వాత యజ్ఞా చార్యులు గుర్తుకు వచ్చారు. ఒకే యజ్ఞమును ఎన్ని పేర్లయినా పెట్టి చేయవచ్చుననీ, అందులో ఇది అవును, అది కాదు అనుటకు వీలులేదని అర్థమైనది. ఒకే ఆడ దేవత ప్రతిమను నా ముందరే మూడు పేర్లు పెట్టి

చూపినా ఎవరూ కాదనలేదు. అలాగే ఒకే యజ్ఞగుండములో ఏ పేరుపెట్టి, ఏ మంత్రమైనా చదివి, ఏ యజ్ఞమైనా చేయవచ్చునని తెలియుచున్నది.

పూర్వమునుండి యజ్ఞములను మనుషులు చేయుచున్నట్లు చరిత్ర చెపుతున్నది. త్రేతాయుగములో దశరథుడు పుత్రులకొరకు యజ్ఞము చేశాడనీ, రామాయణమును చదివిన వారందరికీ తెలుసు. రాముడు పుట్టిన తర్వాత విశ్వామిత్రుడు యజ్ఞ రక్షణ నిమిత్తము రామున్ని తనవెంట తీసుకెళ్ళాడని కూడా విన్నాము. అదే సమయములో రావణబ్రహ్మ, యజ్ఞ భంగము చేయించేవాడని కూడా విన్నాము. ఈ విధముగా త్రేతాయుగము లోనే కాకుండా, ద్వాపరయుగములో కూడా ఎందరో మహర్షులు యజ్ఞములు చేసినట్లు చరిత్ర చెబుతున్నది. ప్రస్తుతము కలియుగములో కూడా అనేకచోట్ల యజ్ఞములను బ్రాహ్మణులు చేయుచుండగా ఎందరో చేయిస్తున్నారు. అనేక ఆశ్రమాలలో, అనేక దేవాలయములలో యజ్ఞకార్యములు జరుగుచున్నవి. వేదమంత్రములను నేర్చినవారు యజ్ఞకార్యములు చేయు రుత్వికులుగా యజ్ఞములను చేయుచుండగా, చేయించువారు ఎందరో కలరు. అయితే సామాన్య మనిషికి యజ్ఞమంటే ఏమిటో తెలియదు. హేతువాదులకుగానీ, నాస్తికవాదులకుగానీ యజ్ఞములను గురించి తెలియదు. వాస్తవముగా చెప్పాలంటే యజ్ఞములను గురించిన పూర్తి సమాచారము యజ్ఞమును చేయించు ధనికులకు కూడా తెలియదు. అందువలన శిల్పాచార్యుడు ఒక ప్రతిమను చూపి ముగ్గురికి మూడు పేర్లు చెప్పినట్లు యజ్ఞాచార్యులైన వారు కూడా యజ్ఞమునకు ఏ పేరైనా పెట్టి చేయుచున్నారు.

ఒక సామాన్యుడు యజ్ఞములను గురించిన పూర్తి సమాచారమును తెలుసుకోవాలంటే, ఎన్నో ప్రశ్నలకు జవాబులను తెలుసుకోవలసి ఉంటుంది.

ఆ ప్రశ్నలు ఏవి అనగా! 1) యజ్ఞమంటే ఏమిటి? 2) యజ్ఞములు ఎక్కడ చేయవలెను? 3) యజ్ఞములను ఎవరు చేయించాలి? 4) యజ్ఞములను ఎవరు చేయాలి? 5) యజ్ఞములు ఎన్ని విధములు? 6) యజ్ఞముల వలన కర్మవచ్చునా? పోవునా? 7) యజ్ఞమునకు మంత్రము అవసరమా? 8) యజ్ఞములు ఏ లగ్నములో చేయాలి? 9) యజ్ఞములు ఎంత కాలము చేయాలి? 10) యజ్ఞములో ఏమి జరుగుచున్నది? 11) యజ్ఞములో అగ్ని ఏది, సమిధ ఏది? 12) యజ్ఞముల వలన కోర్కెలు నెరవేరునా? 13) యజ్ఞమును రావణుడు ఎందుకు భంగము చేశాడు? ఇలా ఎన్నో ప్రశ్నలకు సరియైన జవాబులను తెలుసుకోగలిగినప్పుడు, యజ్ఞమును గూర్చి పూర్తిగా తెలిసినట్లగును.

యజ్ఞము అనగా మన కంటికి కనిపించునట్లు తెలియుచున్న దేమనగా! ఉన్న దానిని లేకుండా చేయడమని తెలియుచున్నది. యజ్ఞములో ముఖ్యమైన కార్యము కాల్చివేయడము, ముఖ్యమైన అగ్ని మండితేనే యజ్ఞము, అగ్ని లేకపోతే యజ్ఞమేకాదు. యజ్ఞములో ముఖ్యమైనది అగ్ని, జరుగుచున్న పని కాల్చివేయడము. కాల్చుటవలన ఉన్న వస్తువులు లేకుండా పోవుచున్నవి. అక్కడవున్న వాటినన్నిటీని సమిధలుగా అగ్నిలో వేయడము వలన ఉన్నవన్నీ నాశనమైపోవుచున్నవని తెలియుచున్నది. అగ్ని సర్వమునూ దహించును. అగ్ని వలన నాశనము తప్ప ఏమీ లేదని కనిపిస్తున్నది. ఈ సూత్రమును అనుసరించి చూస్తే ఎక్కడైనా ఒక వస్తువుగానీ, ఒక పదార్థము గానీ తన సామత్యమును కోల్పోయి, మార్పుచెంది లేకుండా పోవుచున్నదో, అక్కడ యజ్ఞము గుర్తు రాక తప్పదు. ఎక్కడైతే నాశనము జరుగుచున్నదో, అక్కడ యజ్ఞము జరిగినట్లే లెక్కించవలెను. దీనిప్రకారము కనిపించే అగ్ని వలన వస్తువులు కాల్చబడే యజ్ఞమే కాకుండా, కనిపించని అగ్ని వలన నాశనము

జరుగునదంతా యజ్ఞమే అగును. కనిపించని అగ్ని ఏ రూపములో నైనా ఉండవచ్చును. ఉదాహరణకు వందమంది సైనికుల మీద శత్రువులు విమానము నుండి బాంబును జారవిడిచినపుడు, బాంబు తాకిడికి వంద మంది సైనికుల శరీరములు ఉన్న స్థితిని కోల్పోయి, ఛిద్రమైపోయి వారంతా చనిపోయినపుడు, ఆ సంఘటనను కూడా ఒక విధమైన యజ్ఞమే అనవచ్చును. దానికి పేరును కూడా పెట్టవచ్చును. సంఘటన కనిపించినా ఈ నరమేధములోని అగ్ని కనిపించలేదు. యజ్ఞములో, అగ్ని మండే రూపములోనే ఉండవలెనను నియమము లేదు. ఏ రూపములోనైనా ఉండవచ్చును. యజ్ఞములో కాల్చబడునవి లేక నాశనమగునవి ఏవైనా స్థూలముగా ఉండవచ్చును లేక సూక్ష్మముగా ఉండవచ్చును. అలాగే యజ్ఞములో నాశనము చేయు లేక లేకుండా చేయు, దహించివేయు అగ్ని స్థూలంగా ఉండవచ్చును, లేక సూక్ష్మముగా ఉండవచ్చును. ఈ విధముగా ఒక లెక్కప్రకారము సూత్రబద్ధముగా చూస్తే, ఎక్కడైతే ఉన్నది లేకుండా పోవుచున్నదో, ఎక్కడైతే ఉన్నదంతా నాశనమైపోవుచున్నదో, ఎక్కడైతే ఒక వస్తువుగానీ, ఒక పదార్థముగానీ తన సామత్యమునూ, రూపమునూ కోల్పోయి, వేరు విధముగా మార్పుచెందుచున్నదో అక్కడంతా యజ్ఞము జరుగుచున్నదని లెక్కించవలెను.

యజ్ఞమును ఈ విధముగా లెక్కించడము వలన అది శాస్త్రబద్దముగా ఉన్నట్లు తెలియును. యజ్ఞము అను ప్రసక్తి ఎక్కడ వచ్చినా, అది ఈ సూత్రమునకు సంబంధించి ఉండడము శాస్త్రబద్ధత అంటున్నాము. అట్లు కాకుండా ఒక్కొక్క చోట ఒక్కొక్క విధముగా చెప్పుకొంటే దానిని శాస్త్రబద్ధత అనము, అట్లే సూత్రబద్ధత అనుటకు వీలులేదు. శాస్త్రబద్ధత కలిగిన విషయము ఎక్కడైనా మార్పుచెందక ఒకే భావము నిచ్చునదిగా ఉండును.

ఇప్పుడు మనము చెప్పుకొన్న శాస్త్రబద్ధతయొక్క ప్రయోజనము ముందు వ్రాతలో తెలియబోతుంది. ఇప్పుడు ఈ శాస్త్రబద్దతను గురించి చెప్పుకోక పోతే బయట కనిపించే యజ్ఞములను ఒక విధముగా, భగవద్గీతలో భగవంతుడు చెప్పిన యజ్ఞములను ఒక విధముగా చెప్పుకోవలసివచ్చును. అలా చెప్పుకొంటే హేతువాదమునకు జవాబులేనిదిగా ఉండిపోవును. అశాస్త్రీయముగా కనిపించును. అశాస్త్రీయ విషయము కల్పిత విషయ మగును, నిరూపణకు రానిదగును. నేను చెప్పుబోధ శాశ్వితముగా ప్రాణము గలదై, ప్రత్యక్ష ప్రమాణమై, శాస్త్రీయత కల్గినదై ఉండవలెనను ఉద్దేశ్యముతో ముందే యజ్ఞము శాస్త్రబద్ధమైనదని, దానికి సంబంధించిన సూత్రమును చెప్పాము.

యజ్ఞమునకున్న అర్థమునూ, దానికి గల శాస్త్రీయతను గురించి చెప్పుకొన్నాము. చాలామంది మనుషులు యజ్ఞములు దైవారాధనలో భాగమని అనుకోవడము జరుగుచున్నది. కొందరు యజ్ఞమును ఎంతో పూజ్యభావముగా, గౌరవప్రదముగా చూస్తున్నప్పుడు, మేము ప్రత్యేకించి యజ్ఞమనగా నాశనము చేయునదని చెప్పడము, కొందరికి వినేదానికే ఇబ్బందిగా ఉండును. ఎవరికి ఎటువంటి ఇబ్బంది ఉండినా వారిని దృష్ఠిలో ఉంచుకొని, సత్యమును చెప్పకుండాపోతే భూమిమీద ఉన్న వారందరినీ ఇబ్బంది పెట్టినట్లగును. అంతేకాక చెప్పబడు విషయము దైవసంబంధ జ్ఞానమైతే, దానిని గురించి అసత్యముగా చెప్పడము వలన కొన్ని జన్మలకు సరిపడు పాపము సంభవించును. యజ్ఞమనునది సామాన్యమైన విషయము కాదు. ఒక విధముగా ధర్మమైనది, ఒక విధముగా అధర్మమైనది. యజ్ఞమనునది ఆచరించే వానినిబట్టి, ఆచరించే విధానమును బట్టి, యజ్ఞము ధర్మమూ కావచ్చును లేక అధర్మమూ కావచ్చును. యజ్ఞము ధర్మాధర్మము

లకు సంబంధించిన విషయము, కావున ఇపుడు దీనిని గురించి నేను వ్రాయవలసి వచ్చినది.

పూర్వము నుండి యజ్ఞముల చరిత్రను చెప్పుకొంటే యజ్ఞములు రెండు రకములుగా ఉన్నవని చెప్పవచ్చును. ఒకటి కనిపించే యజ్ఞములు, రెండు కనిపించని యజ్ఞములని చెప్పవచ్చును. కనిపించని యజ్ఞములను రెండు రకములుగా విభజించి చెప్పవచ్చును. **కనిపించని సూక్ష్మ యజ్ఞము లలో ఒకటి కర్మను తెచ్చి పెట్టు యజ్ఞమనీ, రెండు కర్మను లేకుండా చేయు యజ్ఞమనీ చెప్పవచ్చును.** యజ్ఞములు స్థూలమనీ, సూక్ష్మమనీ రెండు రకములు కాగా, సూక్ష్మములో మరీ రెండు రకములైనవి. దీనినిబట్టి యజ్ఞములు మొత్తము మూడు విధములుగా ఉన్నవని చెప్పవచ్చును. మొదట స్థూల యజ్ఞము (కనిపించే యజ్ఞము) ఒక విధము కాగా, దానియందు ఎన్నో రకములుగా యజ్ఞములు కలవు. యజ్ఞము అనగా నాశనము చేయునది అని మొదటే తెలుసుకొన్నాము. అగ్ని వలన వస్తువులు కాలిపోయినా, బాంబు వలన మనుషులు చనిపోయినా, పిండిమిషన్‌లో గింజలు పిండిగా మారిపోయినా, పిడుగుపాటుకు గొర్రెలు చనిపోయినా, విషమునకు పురుగులు పూర్తిగా మరణించినా, గాలికి చెట్లు నేలకూలి నశించిపోయినా మొదలగు కనిపించు వినాశకర కార్యములన్నీ కనిపించే (స్థూల) యజ్ఞములనియే చెప్పాలి. పదార్థముగానీ, వస్తువులుగానీ జీవమున్నది గానీ, జీవము లేనిదిగానీ నాశనమైనపుడు అది కనిపించే యజ్ఞమగును. అయితే గుంత త్రవ్వి, గుండమని పేరుపెట్టి అదేపనిగా వస్తువులనూ, వస్త్రములనూ, పదార్థములనూ, పండ్లనూ, నూనెలనూ, లోహములనూ, క్రమమైన పనిలాగ మంత్రములను చెప్పుచూ కాల్చివేయు పనిని మాత్రమే యజ్ఞమని అందరూ అనుకోవడము జరుగుచున్నది. మిగతా

వినాశకర కార్యములను ఎవరూ యజ్ఞములుగా గుర్తించలేదు. కనిపించే నాశన కార్యములే యజ్ఞములుగా ఎవరికీ తెలియనపుడు, కనిపించని యజ్ఞములున్నాయని ఎవరూ కలలో కూడా అనుకోరు. మొత్తము మీద గుండములను చేసి, మంత్రములను ఉచ్చరించుచూ, బ్రాహ్మణులు చేయు కార్యము ఒక్కటి మాత్రమే, నేడు అందరికీ తెలిసిన యజ్ఞముగా ఉన్నది. దీనితో నేడు భూమిమీద యజ్ఞమంటే ఒకటేననీ, కనిపించే ఒక యజ్ఞము మినహా వేరే యజ్ఞములనునవి ఉన్నవని ఎవరికీ తెలియదు. యజ్ఞమంటే అగ్ని ఉంటుందనీ, యజ్ఞమును చేయు రుత్వికులు ఉంటారనీ, యజ్ఞము వద్ద వేదమంత్రములు చదువుచుందురనీ, యజ్ఞమును చేయువారు రుత్వికులు కాగా చేయించువారు ధనికులనీ, యజ్ఞము ఏదో ఒక లాభము కొరకు చేయించుచుందురనీ, యజ్ఞము చేయుట వలన చేయించినవారి కోర్కె నెరవేరుననీ, యజ్ఞము ఎంతో ఖర్చుతో కూడుకొన్నదనీ నేడు అందరికీ తెలిసిన సత్యము.

వాస్తవానికి యజ్ఞములు కనిపించేవి, కనిపించనివి ఉండగా, కనిపించే వాటిలోనే అన్నిటినీ గుర్తించక ఒకే ఒక యజ్ఞము గుర్తించబడి ఉండడము నేటి విషయము కాదు. దాదాపు కలియుగము మొదటినుండి ఉండడమేకాక ద్వాపరయుగము అంత్యకాలములో కూడా చాలామంది ఒక యజ్ఞమునే గుర్తించియున్నారని తెలియుచున్నది. ద్వాపరయుగము చివరిలో అందరికీ ఒకే ఒక యజ్ఞము తెలిసి అందరూ దానినే ఆచరించుచూ, కనిపించే యజ్ఞములు ఎన్నో ఉన్నాయని తెలియకపోవడమే కాకుండా, కనిపించని యజ్ఞములను ఏమాత్రము తెలియని స్థితిలో ప్రజలు, సాధువులు, సన్యాసులు, స్వామీజీలు, గురువులు అందరూ ఉండెడివారు. యజ్ఞములు స్థూలము, సూక్ష్మమే కాకుండా ధర్మయుక్తమైనవి, అధర్మయుక్తమైనవని రెండు

రకములుగా ఉండుట వలన, మనిషి అన్నిటినీ వదలి ఒకే ఒక స్థూల యజ్ఞమును తెలిసి, మిగతావి ఏవీ తెలియని స్థితిలో ఉండడము పూర్తి అధర్మస్థాయిగానున్నదని గుర్తించిన దేవుడు, ద్వాపరయుగ చివరిలో భగవద్గీతను బోధించి, అందులో యజ్ఞములను గురించి చెప్పడము జరిగినది.

యజ్ఞము అనగా కాల్చడము అనీ, ఉన్నదానిని లేకుండా చేయడము అనీ, నాశనము చేయుట అనీ చెప్పడమే యజ్ఞము యొక్క అర్థమని చెప్పుకొన్నాము కదా! అలాంటపుడు కొందరు యజ్ఞమును చేయుచూ, యాగము చేయుచున్నాము అనడము జరిగినది. అట్లు చెప్పడములో వేరే ఏదైనా అర్థమున్నదా? అని కొందరడుగవచ్చును. దానికి జవాబును చూస్తే ఈ విధముగా కలదు. జప తపములు అను పదమును మనము వినియే ఉందుము. జపము ఏ అర్థమునిస్తున్నదో, తపము కూడా అదే అర్థమును తెలుపుచున్నది. అదే విధముగా వ్రత క్రతువులు, యజ్ఞయాగములు అను మాటలు గలవు. జప తపములు రెండూ ఒకే అర్థమును కలిగివున్నట్లు, వ్రత క్రతువులు, యజ్ఞయాగములు ఒకే అర్థమును కల్గియున్నవి. అయితే ఇక్కడ గమనించవలసిన విషయమేమనగా! కొద్దిసేపు చేయుదానిని జపము అనియూ, ఎక్కువ కాలము చేయుదానిని తపస్సు అనియూ చెప్పడము జరుగుచున్నది. జప తపములలో పని ఒకటే అయినా, వాటిని చేయు కాలముల పొడవునుబట్టి అలా చెప్పడము జరుగుచున్నది. ఉదాహరణకు ఒకడు గంటసేపు ధ్యానము చేస్తే వానిని జపము చేశాడని చెప్పవచ్చును, అలాగే వాడు ఒక రోజంతయు జపించితే లేక ధ్యానము చేస్తే అప్పుడు వానిని తపము చేశాడని చెప్పవచ్చును. అలాగే కొంతసేపు చేయు ఆరాధనను వ్రతము అంటాము. కొన్ని దినములు చేయు ఆరాధనను క్రతువు అంటాము.

అట్లే ఒక రోజులో చేయు అగ్ని హెూత్రమును యజ్ఞము అంటాము. కొన్ని రోజులు చేయు దానిని యాగము అంటాము. జప తపములు, వ్రత క్రతువులు, యజ్ఞయాగములు జోడు పదములుగానున్నప్పటికీ ఒకే పనిలోని కాల వ్యత్యాసమునుబట్టి వుండును.

పూర్వము త్రేతాయుగములో దశరథుడు పుత్రకామేష్ఠి యాగము చేశాడనీ, ఆ యాగ ఫలితముగా ఆయనకు సంతతి కల్గినదనీ రామాయణము లో చెప్పగా విన్నాము. యాగము అన్న మాటనుబట్టి అది కొన్ని రోజులు చేయబడినదని అర్థమగుచున్నది. అందరికీ బాగా తెలిసినది దశరథుడు చేసిన పుత్రకామేష్ఠియాగము. యాగము యొక్క పేరులోనే వారు ఆ దినము ఏ ఉద్దేశ్యముతో ఆ యాగము చేశారో తెలియునట్లు పుత్రకామేష్ఠి అని కలదు. పుత్రకామేష్ఠి అనగా పుత్రులను కాంక్షించి (కొడుకులు కావాలని) అని అర్థమును తెలుపుచున్నది. తనకు సంతతిలేని కారణమున అప్పటి కాలములోని మహర్షుల సలహాను అనుసరించి, సంతతి కొరకు పుత్ర కామేష్ఠి అను యాగమును దశరథుడు చేశాడనీ, యాగము చేయుట వలన దశరథునికి పుత్రులు పుట్టారనీ రామాయణములో వ్రాయబడివున్నది. దీనిని బట్టి యజ్ఞయాగాదులు మానవుడు తన కోర్కె కొరకు చేసెడివాడనీ, యజ్ఞ యాగాదులు ప్రపంచ కోర్కెల నిమిత్తము ఏర్పరచబడినవనీ తెలియుచున్నది. యజ్ఞముల విషయములలో ధర్మము, అధర్మము యొక్క విషయము మనిషికి తెలియకున్నా, యజ్ఞము వలన కోర్కెలు నెరవేరునని మాత్రము అర్థమగు చున్నది. దేవుడు భగవద్గీతలో కూడా ఇటువంటి యజ్ఞముల వలన నన్ను తెలియుటకు సాధ్యముకాదని స్పష్టముగా చెప్పాడు. ముఖ్యముగా గమనించ వలసిన విషయమేమనగా! మనిషి బయట చేయు స్థూల యజ్ఞము ద్వారా

దేవుడు తెలియబడడని జ్ఞాపకముంచుకోవలెను. ఇంకా వివరముగా చెప్పుకొంటే కర్మను సంపాదించి పెట్టు యజ్ఞము ద్వారా దేవుడు తెలియ బడడని తెలియుచున్నది.

మనము మొదటనే యజ్ఞములను మూడు రకములుగా విభజించు కొన్నాము. తర్వాత వాటిని రెండు విధముల చెప్పుకొన్నాము. రెండు విధానములలో ఒకటి కర్మసాహిత్యమును చేయునది. రెండవది కర్మ రాహిత్యమును చేయునదిగా చెప్పుకొన్నాము. కర్మరాహిత్యమును చేయు యజ్ఞము వలన చివరకు దైవమును తెలియవచ్చును. కర్మసాహిత్యమును కల్గించు యజ్ఞము వలన దైవమును తెలియలేము. మనుషులకు తెలిసిన యజ్ఞములన్నియూ కర్మను వృద్ధి చేయునవే. కనుక అటువంటి యజ్ఞములను అధర్మయజ్ఞములని భగవద్గీతలో చెప్పడము జరిగినది. కోర్కెల నిమిత్తము దశరథుడు చేసిన యజ్ఞము కూడా అధర్మయుక్తమైనదని తెలియుచున్నది. శ్రీరాముని తండ్రి దశరథుడు, పుత్రసంతతి కొరకు పుత్రకామేష్ఠియాగము చేయగా, దశరథుని కుమారుడైన శ్రీరాముడు రాజ్యకాంక్షతో అశ్వమేధ యాగమును చేశాడు. కొందరు రాజులు తమ రాజ్యములో వర్షములు బాగా కురవాలని వరుణయజ్ఞము (వరుణయాగము) చేశారు. కొందరు ప్రపంచశాంతి కొరకు విశ్వశాంతి యజ్ఞము చేశారు. ద్వాపరయుగ అంత్యము, కలియుగము ప్రారంభములో పరీక్షిత్తు రాజు యొక్క కుమారుడైన జనమే జయుడు, తన తండ్రి మరణమునకు కారణమైన పాములను లేకుండా చేయుటకు, సర్పయాగమును చేసినట్లు చరిత్రకలదు. ఈ విధముగా గతములో ఎందరో తమ కోర్కెలను నెరవేర్చుకొను నిమిత్తము యజ్ఞములను చేయగా, నేడు కూడా అనేకచోట్ల అనేక సందర్భములలో ప్రపంచ కోర్కెల నిమిత్తమే యజ్ఞములను చేయుచున్నారు. పూర్వము యజ్ఞములను చేయు

అలవాటు భారతదేశములో మాత్రముండెడిది. ప్రస్తుత కాలములో విదేశ ములలో విదేశీయులు సహితము యజ్ఞములను తెలుసుకోగలిగి, వారి కోర్కెలను నెరవేర్చుకొనుటకు భారతదేశమునుండి యజ్ఞములను చేయు రుత్వికులను పిలువనంపుకొని యజ్ఞములను చేయుచున్నారు.

యజ్ఞములను చేయువారికి ప్రత్యేక పదమును ఉపయోగించి రుత్వికులు అంటారు. యజ్ఞములను కర్మసహితము చేయునవి అనియూ, కర్మరహితము చేయునవి అనియు రెండు రకములుగా ఉన్నవని చెప్పు కొన్నాము. **బ్రహ్మజ్ఞానులు కర్మరహితము చేయు యజ్ఞములను చేయగా, బాహ్య జ్ఞానులు కర్మను కలుగజేయు యజ్ఞములు చేయుచుందురు.** యజ్ఞములను చేయించువారు ఎవరైనా, యజ్ఞకార్యమును చేయువారు రుత్వికులు. ఊరికి పోవలసినవారు, ప్రయాణము చేయువారు ఎవరైనాగానీ బస్సును నడుపువాడు డ్రైవర్ అన్నట్లు, యజ్ఞములను చేయించువారు ఎవరైనా కావచ్చును. కానీ యజ్ఞకార్యమును రుత్వికులే చేయుదురు. రుత్వికులు వేదమంత్రములు చదువువారై, శుచి శుభ్రత కల్గినవారై బ్రాహ్మణులై ఉందురు. ప్రయాణీకులు లేకపోతే బస్సు నడవదు, డ్రైవర్‌కు పని ఉండదు. బస్సు నడపడమే అలవాటుగానున్న డ్రైవర్ వేరే పనిని చేయలేడు. అందువలన తన పనికొరకు ప్రయాణీకులను తయారు చేయవలసిన అవసరము ఏర్పడినది. అలాగే యజ్ఞములను చేయుటయే పనిగా పెట్టు కొన్న కొందరు, అదే పనిగా ప్రజలకు యజ్ఞములను గురించి బోధించి, యజ్ఞముల వలన కొన్ని కార్యములు నెరవేరుననీ, ఏ కార్యము అయినా సఫలమగుటకు యజ్ఞములను చేయవచ్చుననీ తెలుపుట వలన, ప్రజలు తమ కోర్కెల నిమిత్తము యజ్ఞములను చేయుటకు పూనుకొంటున్నారు. మనుషుల ఆశల వలన యజ్ఞములు అక్కడక్కడ రుత్వికులు చేయుచున్నారు.

మనుషుల ఆశలనుబట్టి కొత్త యజ్ఞములను సృష్ఠించి వాటికి క్రొత్తపేర్లు పెట్టడము కూడా జరిగినది. మనిషి కోర్కెలను సాకుగా తీసుకొని రుత్వికు లైనవారు లేనిపోని యజ్ఞములను తయారుచేసి, వాటి కొరకు విపరీత ధనమును ఖర్చు చేయించుచున్నారు. యజ్ఞములో ఖర్చగునదంతా యజ్ఞము లను చేయించువారు భరించుట వలన, రుత్వికులు తమ ఇష్టమొచ్చిన పద్ధతిలో ఖర్చుపెట్టించుచున్నారు. ఎంత ఖర్చు ఎక్కువైతే అంత పెద్ద యజ్ఞముగా ప్రజలు అనుకొందురనీ, పెద్ద యజ్ఞమునకు ఎక్కువ ఫీజు తీసుకోవచ్చని యజ్ఞములలో అనవసరముగా ఖర్చు చేయిస్తున్నారు.

ఎంతో ఖరీదైన విత్తనములను భూమిలో చల్లినపుడు అవి నష్టము గానే కనిపించినా, తర్వాత మూడు నాలుగు నెలలకు చల్లిన విత్తనములు పంట రూపములో ఎంతో లాభమును చేకూర్చునని, రుత్వికులు చెప్పడము వలన కేజీ నెయ్యిని యజ్ఞగుండములో పోయవలసినపుడు, ఎక్కువ పోస్తే ఎక్కువ లాభము వస్తుందని, డబ్బా నెయ్యిని పోయువారు కూడా కలరు. యజ్ఞ గుండములో పట్టువస్త్రములను, బంగారును, గంధపు చెక్కలను కాల్పించువారు కూడా కలరు. అలా చేయడము వలన విలువైన వస్తువులను, విలువైన ఆహార పదార్థములను, విలువైన వస్త్రములను కోల్పోవుచున్నాము. అలా ఒక యజ్ఞములో పెద్ద ఎత్తున ఖర్చు పెట్టిన వారికి దానికి తగినట్లు లాభము వస్తుందా అని ప్రశ్నించుకొని చూస్తే, పూర్వము యజ్ఞములు చేసినవారికి వారి పనులు నెరవేరి లాభమొచ్చినదేమో గానీ, ఇప్పటికాలములో యజ్ఞముల వలన ఫలితము దక్కునను నమ్మకము లేదు. పూర్వము యజ్ఞములను చేయడము వలన పనులు జరగడము, లాభము రావడము, కోర్కెలు నెరవేరడము జరిగినప్పుడు, ప్రస్తుత కాలములో కొన్ని యజ్ఞముల వలన మనిషి నష్టపోవుచున్నాడు తప్ప లాభపడడములేదు. ఏ పని నిమిత్తము

యజ్ఞము చేస్తే ఆ పని నెరవేరడము లేదు. పూర్వము పుత్రులకొరకు యజ్ఞము భారీగా చేసినందుకు దశరథునికి కొడుకులు పుట్టారు కదా! అంత కార్యము నెరవేరినప్పుడు, నేటి యజ్ఞముల వలన చిన్న కార్యము కూడా నెరవేరదా? అని ప్రశ్నించుకొని చూస్తే పూర్వము జరిగినట్లు ఇప్పుడు జరుగుతుందను నమ్మకము లేదు. యజ్ఞమును పూర్వ కాలములో ఎట్లు చేశారో అట్లే చేసినా, కొన్నిచోట్ల కొన్ని యజ్ఞములలో కొంత ఫలితము కనిపించినా, కొన్ని చోట్ల ఏమాత్రము ఫలితము దక్కడము లేదు. యజ్ఞము చేస్తే యజ్ఞమును చేయించినవానికి వాడు ఆశించిన ఫలితము పూర్వము దక్కినట్లు ప్రస్తుత కాలములో ఎందుకు దక్కడము లేదు? పూర్వము కోర్కెలు నెరవేరినట్లు ఇప్పటి కాలములో కొందరి కోర్కెలు ఎందుకు నెరవేరడము లేదు? అని ఆలోచించి చూస్తే కొన్ని మనకు తెలియని సత్యములు బయటపడుచున్నవి.

యజ్ఞములు స్థూలముగా కనిపించేవైనా, ఆ యజ్ఞములలో స్థూలముగా ఎంతో డబ్బును, ఎన్నో వస్తువులను, ఎంతో నెయ్యిని పోగొట్టు కొనినా, యజ్ఞములయందు ఏమి వినియోగించినా, ఫలితము కనిపించ కుండానే వస్తుంది. ఇక్కడ ఒక సూత్రమును చూస్తాము. కనిపించి అయినా, కనిపించక అయినా ఒక పని జరిగింది అంటే, అక్కడ కనిపించే వ్యక్తిగానీ, కనిపించని వ్యక్తిగానీ ఆ పనిని చేసి ఉండాలి అను సూత్రము ప్రకారము, యజ్ఞము చేసినపుడు యజ్ఞమును చేసినవాని కోర్కెను ఎవరో ఒకరు నెరవేర్చాలి. ఎవరు ఆ పనిని చేయుచున్నారని పరిశీలించితే, బాహ్యముగా మంత్రపఠనముతో యజ్ఞము చేయు ప్రతిచోట, ఆ యజ్ఞమునకు ఒక అధిపతివచ్చి చేరును. భూమిలో ఎవరైనా ధనమును (బంగారము మొదలగు లోహములను) దాచి ఉంచినపుడు ఆ స్థలములోనికి ఒక సూక్ష్మశక్తి వచ్చి

చేరును. ఆ సూక్ష్మ శక్తి గ్రహము కావచ్చును లేక భూతము కావచ్చును. అలా చేరిన శక్తి ఆ ధనమును కాపలాకాస్తూ వుండును. ఎప్పటికైనా పూడ్చిపెట్టిన వారు తీసుకొంటే అక్కడున్న శక్తి ఏమీ చేయదు. ఒకవేళ పూడ్చిపెట్టిన వారు కాకుండా ఇతరులు ఎవరైనా తీసుకోవాలనుకొంటే, అక్కడ కాపలాగానున్న శక్తి ఆటంకము చేయును. కనిపించని శక్తి యొక్క ఆటంకము ఎవరికీ అర్థముకాదు. తీసుకోవాలని ప్రయత్నించినవానిని భయపెట్టి కానీ, కొట్టి కానీ ఆ ప్రయత్నమును వదులుకొనునట్లు చేయును. కొన్నిచోట్ల సూక్ష్మశక్తి మనుషులను చంపివేసిన సంఘటనలు కూడా కలవు. ఏ విధముగా ఒక సూక్ష్మశక్తి నిధియున్న చోట చెప్పకనే వచ్చి చేరుచున్నదో, అట్లే ఒక యజ్ఞము చేయుచోట ఆ యజ్ఞమును ఆధారము చేసుకొని ఒక సూక్ష్మశక్తి వచ్చి చేరుచున్నది. ఎక్కడ బాహ్యాయజ్ఞములను చేసినా, అది చిన్నయజ్ఞమైనా లేక పెద్ద యజ్ఞమైనా దానికి యజమానిగా గ్రహముగానీ, భూతముగానీ వచ్చి చేరును. భూమిలోనున్న నిధికి తానే యజమానిని (అధిపతిని) అని అక్కడి శక్తి ఎట్లు అనుకొనుచున్నదో, అదే విధముగా యజ్ఞమువద్దకు వచ్చి చేరిన శక్తి, ఆ యజ్ఞమునకు తానే అధిపతినని అనుకొనును. యజ్ఞమునకు ఒక శక్తి అధిపతిగా వచ్చియున్నదని, యజ్ఞమును చేయు ఋత్వికులకు కూడా తెలియదు.

ఎవరు ఎక్కడ ఏ యజ్ఞము చేసినా, అక్కడ యజ్ఞము చేయువారికి కూడా తెలియకుండా ఒక సూక్ష్మశక్తి వచ్చి ఆ యజ్ఞమును వీక్షించుచూ ఉండును. అలా అక్కడికి వచ్చిన గ్రహముగానీ, భూతముగానీ గొప్పశక్తి కలదైవుండును. ఇవన్నియు దేవునికి తెలియకుండా ఏదీ జరగడము లేదని మీకు మధ్యలో జ్ఞాపకము చేయుచున్నాను. అలా వచ్చిన సూక్ష్మ గ్రహము లేక భూతము, యజ్ఞమును చేయువాడు ఏ ఉద్దేశ్యముతో చేయుచున్నాడో

తెలిసినదై, యజ్ఞము అయిపోయిన తర్వాత వాని కోర్కెను నెరవేర్చును. ఇప్పుడు "ఖగోళములోని భూతములు, గ్రహములు దేవుని పాలనలో భాగమై, దైవజ్ఞానమును కల్గియుండునని మీరే చెప్పారే, అటువంటి జ్ఞానము తెలిసిన సూక్ష్మశక్తులు అధర్మములైన యజ్ఞములవద్దకు వచ్చి, యజ్ఞములకు అధిపతిగా ఉండడమేమిటి? అలా ఉన్న శక్తులు ప్రపంచ కోర్కెలతో మునిగి యజ్ఞము లను చేయు మనుషుల కోర్కెలను నెరవేర్చడమేమిటి?" అని కొందరు నన్ను ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఇలా ఉన్నది. భగవంతుడు చెప్పిన భగవద్గీతయందు విజ్ఞానయోగము అను అధ్యాయమున...

శ్లో॥ 20. కామైస్తైస్తైర్హృత జ్ఞానాః ప్రపద్యంతే న్య దేవతాః ।
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా॥

శ్లో॥ 21. యోయో యాంయాం తనుంభక్తశ్శ్రద్ధ యార్చితు మిచ్ఛతి।
తస్య తస్యా చలాం శ్రద్ధాం తా మేవ విదధా మ్యహమ్॥

శ్లో॥ 22. సతయా శ్రద్ధ యా యుక్తస్త స్యా రాధన మీహతే ।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్॥

శ్లోకములలో గల సారాంశమును చూస్తే ఇక్కడ వచ్చిన ప్రశ్నకు జవాబు దొరుకుచున్నది. అక్కడి సారాంశము ఇలా కలదు. ప్రపంచ సంబంధమైన పాపములను సంపాదించుకొను అజ్ఞానులు ఆశలలో మునిగినవారై, వారి కోర్కెలు నెరవేరుటకు ఇతర దేవతలనూ, ఇతర ఆరాధనలనూ, యజ్ఞయాగాదులనూ వాటి నియమముల ప్రకారము చేయుచుందురు. ఎవడు ఏ భావముతో ఏ విధమైన శ్రద్ధతో ఆరాధన చేయుచున్నాడో వానికి ఆ శ్రద్ధనే ఉండునట్లు, వాడు ఆ కార్యములను

చేయునట్లు దేవుడే చేయుచున్నాడు. ఎవడు ఏ శ్రద్ధతో యజ్ఞములనుగానీ, ఇతర ఆరాధనలను గానీ చేయుచున్నాడో, వానికి వాని కోర్కెలు నెరవేరునట్లు దేవుడు ఏర్పాటు చేసియుంచాడు. శ్రద్ధతో యజ్ఞములు చేయువానికి ఉన్న కోర్కె ఏదో దానిని తన పరిపాలనలోని సూక్ష్మశక్తి చేత నెరవేరునట్లు చేయుచున్నాడు. ఇదంతయు దేవుని ఆజ్ఞలోని భాగముగానే జరుగుచున్నది.

భూమిమీద జ్ఞానముగానీ, అజ్ఞానముగానీ దేవునికి తెలియకుండా ఏదీ లేదు. **అజ్ఞానుల ప్రపంచ కోర్కెలను నెరవేర్చువాడు కూడా దేవుడే. జ్ఞానులకు జన్మరాహిత్యము చేసి తనలో కలుపుకొనువాడు కూడా దేవుడే.** అజ్ఞానులైనవారు అధర్మములైన యజ్ఞములను ఆచరించునపుడు, యజ్ఞముల వలన దేవుడు తెలియబడడనీ, వాటివలన ప్రపంచ కోర్కెలు నెరవేరుననీ ఉన్నప్పుడు, దేవుడు తన దూతలైన సూక్ష్మశక్తుల ద్వారా యజ్ఞములను చేసినవారి కోర్కెలను నెరవేర్చితే, దేవుడు కూడా అధర్మములనే ప్రోత్సహించి నట్లు కాదాయని కొందరు అడుగవచ్చును. ఈ ప్రశ్న చాలా ముఖ్యమైనదే! ఈ ప్రశ్నకు అందరూ జవాబు తెలుసుకొని తీరాలి. సృష్ట్యాది నుండి దేవుడు ఏ పనినీ చేయకున్నా, ముందే ఏది ఎలా జరగాలో నిర్ణయించి ఆదేశించి ఉంచాడు. ఇప్పుడు దేవుడు ఏమీ చేయకున్నా, దేవుడే చేస్తున్నాడని మనము అనుచున్నాము. వాస్తవానికి దేవుడు ఏమీ చేయలేదు. సృష్టికి ముందే రచించిన రచన ప్రకారము భూమిమీద గ్రహములు, భూతములు మనుషులకు కనిపించకుండా చేయుచున్నవి. ఫలానా గ్రహములు చేయు చున్నారని తెలియని మనుషులు, ఆ పనిని దేవుడే చేశాడు అని అనుకొను చున్నారు. అదే విధముగా యజ్ఞముల వెనుక ఎవరికీ కనిపించకుండా సూక్ష్మశక్తులు పని చేస్తున్నవని, యజ్ఞములను చేయు రుత్వికులకు కూడా

తెలియదు. యజ్ఞములు చేయు రుత్వికులు తాము యజ్ఞగుండములో అగ్నికి ఆహుతిచ్చు వస్తువులు, వస్త్రములు, ఔషధములు మొదలగునవన్నీ దేవతలు స్వీకరిస్తారనీ, వాటితో తృప్తి చెందిన దేవతలు ప్రతిఫలముగా తమ కోర్కెలను నెరవేర్చుదురనీ అనుకోవడము జరుగుచున్నది.

త్రేతాయుగములో దశరథుడు పుత్రకామేష్ఠి యాగము చేసినప్పుడు, ఆ యాగమునకు కనిపించకుండా అధికర్తగానున్నవాడు ఎవడో, అప్పటికీ ఇప్పటికీ ఎవరికీ తెలియదు. ఆ దినము ఏ భూతము ఆ యజ్ఞమునకు అధిపతిగానున్నదో, ఆ భూతమే వారికి సంతతిని ఇచ్చినది. పుత్రులను ఆశించి చేసిన యజ్ఞములోనే కాకుండా, దేనిని ఆశించి చేసిన యజ్ఞములో నైనా, ఇదే విధానము జరుగుచున్నదని తెలియుచున్నది. ఇంకొక తెలియని విషయమేమనగా! చేయవలసిన యజ్ఞమును రుత్వికులు అశ్రద్ధతో చేసినా, చేయించేవాడు శ్రద్ధాహీనుడై మ్రొక్కుబడిగా చేసినా, ఆ యజ్ఞమునకు అధిపతియైన గ్రహశక్తికి కోపమువచ్చును. దానివలన అశ్రద్ధతో చేసిన రుత్వికులకూ, చేయించిన యజమానికీ తీరని నష్టము కష్టము వచ్చును. యజ్ఞమును ఏ కోర్కెతో చేసివున్నారో ఆ కోర్కె నెరవేరదు. అందువలన యజ్ఞములను చేయువాడు, చేయించువారు శ్రద్ధ కలిగి చేయవలసివుండును. ఇప్పుడు కొందరు ఒక ప్రశ్న అడుగుటకు అవకాశము కలదు. అదేమనగా! "దేవుడు స్వయముగా చేయకున్నా, గ్రహములుగానీ, భూతములుగానీ యజ్ఞములకు అధిపతులుగా ఉండి, యజ్ఞములను చేసినవారి కోర్కెలను తీర్చుట వలన యజ్ఞములను ఆచరిస్తే ఫలితమున్నదని, మనుషులందరూ యజ్ఞములవైపు కోర్కెల నిమిత్తము పోవుదురు కదా! అప్పుడు కామ్యాసక్తులు తప్ప మోక్షాసక్తులు ఎవరూ లేకుండా పోవుదురు కదా! ఇదంతయు చూస్తే అధర్మములను ఖండించి ధర్మములను నెలకొల్పుతానని చెప్పిన దేవుడు

ధర్మములవైపు ఉన్నట్లా? లేక అధర్మములవైపు ఉన్నట్లా? అని సంశయమే ర్పడుచున్నది. భగవద్గీతలో యజ్ఞములను అధర్మములని ప్రకటించిన భగవంతుడు బ్రాహ్మణులు చేయు యజ్ఞములను ఎందుకు ఖండించలేదు?" అని అడుగవచ్చును. దానికి జవాబు ఈ విధముగా కలదు.

ధర్మములు ఉన్నాయి, అధర్మములూ ఉన్నాయి. ధర్మములనుకొని ధర్మములుకాని ఆచరణను ఆచరించడము అధర్మమగును. **ధర్మము వలన దేవుడు తెలియబడి మోక్షము లభించుచున్నది. అధర్మము వలన మోక్షము లభించడములేదు, దేవుడు తెలియబడడము లేదు. బాగా పరిశీలిస్తే ధర్మము కానిది అధర్మమగుచున్నది. ధర్మముల స్థానములో ధర్మముకానిది ఉన్నప్పుడు దానిని అధర్మమంటున్నాము.** అంతేగానీ అధర్మము ధర్మమునకు శత్రువు కాదు. అట్లే ధర్మము కూడా అధర్మమునకు శత్రువుకాదు. ధర్మము వలన వచ్చు ఫలితము ఒక్కటైతే, అధర్మము వలన వచ్చు ఫలితము కొద్ది తేడాతో మరొకటిగా ఉన్నది. ధర్మముగానీ, అధర్మముగానీ రెండూ ధర్మము జాతివే గానీ వేరు జాతివికాదు. ధర్మ ఆచరణ వలన కర్మరహితము జరిగి ముక్తి లభించుచున్నది. అధర్మ ఆచరణ వలన పుణ్యకర్మవచ్చి సుఖములు కలుగు చున్నవి. **ధర్మము వలన మోక్షమురాగా, అధర్మమువలన మోక్షముకాని స్వర్గము లభించుచున్నది. ధర్మమునకూ, అధర్మమునకూ పూర్తి వ్యతిరేఖమైన చెడు గుణములను కల్గినవారిని ధర్మశత్రువులు అంటాము.** పూర్తి అజ్ఞానులైన వారు ఇటు ధర్మములనుగానీ, అటు అధర్మములనుగానీ ఇష్టపడరు. ధర్మములను, అధర్మములను రెండిటినీ ద్వేషించువారై ఉందురు. అటువంటి వారు పాపమును సంపాదించుకొనినవారై నరకమును పొందు చుందురు. ఇప్పుడు మనుషులను మూడు రకములుగా విభజించవచ్చును. ఒకటి ధర్మవరులు, రెండు అధర్మవరులు, మూడు ధర్మాధర్మములకు వ్యతి

రేఖమైనవారు. ఈ మూడు రకములవారిలో **ధర్మవరులకు మోక్షము లభించును. అధర్మవరులకు స్వర్గము లభించును. ధర్మశత్రువులైన వారికి నరకము లభించును.** మోక్షము, స్వర్గము, నరకము అను మూడు అనుభవములు మనిషికి దేవుడు ఏర్పరచి పెట్టాడు. మోక్షము, స్వర్గము, నరకము అను మూడు అనుభవములను కూడా తన జ్ఞానములో దేవుడు వివరించి చెప్పాడు. మనిషి తన శ్రద్ధను ధర్మములమీద కేంద్రీకరించి మోక్షమును పొందవచ్చును. అలాగే అధర్మముల మీద తన శ్రద్ధనుంచి స్వర్గమును పొందవచ్చును. పూర్తి అజ్ఞానముగల ప్రపంచ విషయముల మీద శ్రద్ధను గలిగి నరకమును కూడా పొందవచ్చును. ఈ మూడిటి విషయములో దేవుడు ఎవని శ్రద్ధకు వానిని వదలివేశాడు.

భారతదేశమునకు రాష్ట్రపతి అగుటకు కొన్ని అర్హతలు ఉండాలి అంటారు. రాష్ట్రపతి పదవికి పోవాలంటే అతను భారతదేశ పౌరుడైవుండాలి. తర్వాత అరవై (60) సంవత్సరముల వయస్సు దాటివుండాలి అను నియమములు గలవు. అలాగే ఒక మనిషి దేవుడు అగుటకు కూడా కొన్ని అర్హతలు ఉండాలి. దేవుని పదవి చేపట్టాలంటే అతడు యోగియై ఉండాలి. కర్మ పూర్తి లేకుండా అయిపోయి వుండాలి. పగటి పూట, శుక్లపక్షమున, ఉత్తరాయణమున, సూర్యరశ్మిగల ప్రదేశములో చనిపోవాలి. అటువంటి వాడు దేవునిగా మారవచ్చును. భారతదేశ పౌరసత్వము లేకున్నా, అరవై (60) సంవత్సరములు వయస్సు దాటకున్నా ఎంత మంచివాడైనా, ఎట్లు రాష్ట్రపతి పదవికి అర్హుడు కాడో, అలాగే యోగికాకున్నా, కర్మ అయిపోకున్నా, చనిపోవలసిన సమయములో చనిపోవక పోయినా అతడు దేవుడు అగుటకు, మోక్షము పొందుటకు, తిరిగి పుట్టకుండా ఉండుటకు, అంతటా వ్యాపించి సర్వాంతర్యామి అనిపించుకొనుటకు అర్హుడుకాడు. ధర్మములను

ఆచరించి దైవమును చేరుటకు మోక్షము మీద పూర్తి ఆసక్తి కల్గినవాడు ఉంటే, అటువంటివాడు దేవునికి ఇష్టుడగును. దైవము యొక్క విలువ తెలియనివాడు, మోక్షము మీద శ్రద్ధలేనివాడు, దేవుని ధర్మములను తెలియనివాడు, దేవుడు ఒక్కడే అని చెప్పుచూ ఇతరులను కూడా దేవునిగా లెక్కించుకొనువాని మీద దేవునికి ఇష్టముండదు. అటువంటి వాడు తనవద్దకు రావడము దేవునికి ఇష్టముండదు. అటువంటివాడు వానిదారిలో వాడు పోవునట్లు దేవుడు చేయుచున్నాడు. దేవునికి ఇష్టములేనివానిని తనవైపునకు రాకుండా చేయుటకు మాయ అను దానిని దేవుడు సృష్ఠించి పెట్టాడు. దేవుడు ఎవనిని ఒప్పుకొనునో వానిని, మాయ తన బంధమునుండి విడచి దేవుని వద్దకు పోవునట్లు చేయుచున్నది. ఈ విషయమును తెలిసిన ఒక జ్ఞాని తన పద్యములో ఇలా చెప్పుచున్నాడు.

***పతియొప్పిన సతి యొప్పును***
***పతి సతులొకటైన పరమ పావనమందున్***
***పతి సతి న్యాయమె మోక్షం***
***బతులిత పరమాత్మ నైక్యమగురా వేమా.***

పతి అనగా పరమాత్మ, సతియనగా మాయ అని అర్థము. పతి యొప్పిన అనగా దేవునికి ఇష్టమైతే, మాయ కూడా సమ్మతించుననీ, అప్పుడు మాయ తన బంధమునుండి మనిషిని వదులుననీ, అలా మాయ చేత వదలబడినవాడే దేవున్ని చేరి మోక్షము పొందుననీ పద్యములో భావము కలదు. మాయ వదలనంతవరకు దానిని దాటి మోక్షము వరకు ఎవడూ రాలేడని భగవద్గీత విజ్ఞానయోగమున 14వ శ్లోకములో కూడా చెప్పారు.

శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే ॥

**భావము :-** నేను తయారు చేసిపెట్టిన మాయ గుణములతో కూడుకొన్నదై బలముగా ఉన్నది. దానిని దాటుట దుస్సాధ్యమైన పని. ఎవడూ దానిని దాటలేడు. అయితే నన్ను ఆరాధించువాడు మాత్రము మాయను దాటి రాగలడు. నన్ను ఆరాధించువానిని మాత్రము నా మాయ ఆటంకపరచక వదలివేయును. దీనినిబట్టి మాయ మనిషిని దేవునివైపు పోకుండా చేయుటకు, యజ్ఞము అను వలను కల్గియున్నదని తెలియు చున్నది. దేవుని ధర్మములను తెలియనివాడు, దేవుని ఆరాధించనివాడు, దేవునివైపు పోకుండా మాయ యజ్ఞములందు లగ్నము చేయుచున్నది. దేవున్ని ఆరాధించుటకు యజ్ఞములు ముఖ్యమని మాయ బోధించడము వలన, దైవారాధనలో యజ్ఞములు ముఖ్యమైనవని మనిషి చెప్పగలు చున్నాడు. మనిషికి దేవుడు తన మాయ ద్వారా యజ్ఞములయందు ఇష్టము కల్గించి నిత్యము వాటిని చేయునట్లు చేయును. అందువలన యజ్ఞములను అధర్మములని చెప్పిన దేవుడు, వాటిని పూర్తి ఖండించి మనుషులు చేయ కూడదని చెప్పలేదు. పైగా తనకు ఇష్టములేని వాడు, తనవైపు రాకుండా ఉండుటకు, యజ్ఞములను మాయ చేత ధర్మములని నమ్మించుచున్నాడు. యజ్ఞములు అధర్మములని చెప్పిన దేవుడు వాటిని చేయకూడదని చెప్పలేదు. ఎవనికి ఎటువంటి శ్రద్ధవుంటే, అటువంటి ఆరాధననే వదలకుండా చేయునట్లు చేసి, వాటివలన తమ కోర్కెలను కూడా నెరవేరునట్లు చేయు చున్నాడు. యజ్ఞముల వలన తాను తెలియబడననీ, యజ్ఞములు అధర్మము లనీ వాటివలన పుణ్యము వస్తుందని చెప్పాడు. అధర్మములైన యజ్ఞములు పాపకార్యములని కూడా దేవుడు ఎక్కడా చెప్పలేదు. యజ్ఞములు ధర్మములు

కానంతమాత్రమున ధర్మవిరుద్ధములని చెప్పుటకు వీలులేదు. ధర్మముకానిది అధర్మమగును కానీ ధర్మవిరుద్ధముకాదు. ఇప్పుడు అవసరమునుబట్టి కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! ధర్మమునకు వ్యతిరేఖమైనది అధర్మమని మేము ఇంతవరకు అనుకొనివుంటిమి. ఇప్పుడు ధర్మముకానిది అధర్మమనీ, అధర్మము ధర్మమునకు వ్యతిరేఖముకాదని మీరు చెప్పుచున్నారు. అట్లయితే ధర్మమునకు పూర్తి వ్యతిరేఖమైనది ఏది అని ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు.

ధర్మము జీవునికి ముక్తిని కల్గించుచున్నది. దీనిని ఆధారము చేసుకొని ముక్తిని కల్గించకుండా జన్మ కల్గించునది ఏదైతే ఉన్నదో, దానిని ధర్మమునకు వ్యతిరేఖమైనదని చెప్పవచ్చును. యజ్ఞములు పుణ్యమును మనిషికి అంటగట్టుట వలన, పుణ్యమును అనుభవించేదానికి మనిషి ముక్తికి వ్యతిరేఖముగా జన్మకు పోవలసివుండును. కావున యజ్ఞములైన అధర్మములు ధర్మములకు వ్యతిరేఖము కదా! అని కొందరడుగవచ్చును. ఆ విధముగా అయితే అధర్మములు ధర్మములకు వ్యతిరేఖమైనవని మేము ఒప్పుకోక తప్పదు. కొన్ని సందర్భములలో ఎదుటివారికి అర్థమగుటకు ధర్మములకు విరుద్ధములు అధర్మములని చెప్పినా ఫరవాలేదు. కానీ ఆ మాట శాస్త్రబద్ధత కాదు. కావున ధర్మమునకు వ్యతిరేఖమైనవి అధర్మములని బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము చెప్పకూడదు. "పద్ధతి ప్రకారము సత్యమే అనీ, ఈ విధముగా ఒప్పుకోక తప్పదని మీరు చెప్పుతూనే, మరొక ప్రక్క అది అసత్యము, శాస్త్రబద్ధముకాదు అని అనడము రెండు నాల్కల మాటగా కనిపిస్తున్నది" అని ఎవరైనా నన్ను ప్రశ్నించవచ్చును. దానికి జవాబు చెప్పవలసిన బాధ్యత నాదే, కావున మీకు అర్థమగుటకు ఒక ఉదాహరణను చెప్పుతాను చూడండి.

పూర్వము గొప్ప యోగులైనవారు అప్పటి పరిపాలకులైన రాజుల ఇళ్ళకు పోయెడివారు. ఫలానా మహర్షి, లేక ఫలానా యోగి తమ ఇంటికి వస్తున్నాడని తెలిసిన రాజు యోగిని ఆహ్వానించి, ఎత్తయిన పీఠముమీద కూర్చుండబెట్టి, ఆ యోగి పాదములను ఒక పళ్ళెములో పెట్టి నీటితో కడిగెడివారు. కడిగిన నీరును అక్కడున్నవారందరూ తమ తలల మీద చల్లుకొనెడివారు. అలా చేయడము వలన యోగి పాదములకున్న పాదధూళి నీటిలోనికి వచ్చుననీ, యోగియొక్క పాదధూళికి ఉన్న శక్తి ఆ నీటిలో సమానముగా వ్యాపించి ఉండుననీ, అలా యోగశక్తివంతమైన నీరును తమ తలల మీద చల్లుకోవడము వలన తమ తలలోనున్న కర్మలు నశించునని వారి భావము. ఇదంతా ఆ రోజులలో తెలిసి ఇష్టముగ యోగి పాదములను కడిగిన నీరును తలమీద వేసుకొనెడివారు. ఈ విధానము మంచిది, అందరూ ఒప్పుకోతగినది. ఒక దినము ఒక రాజు ఇంటికి ఒక మహర్షి రావడము, రాజు ఇంటిలోనివారు మరియు రాజు అందరూ కలిసి, వచ్చిన మహర్షి పాదము లను కడిగి ఆ నీరును అందరూ తలమీద చల్లుకోవడము జరిగినది. మరుసటి దినము ఇంకొక రాజ్యమునకు అధిపతిగానున్న రాజు, మహర్షి వచ్చిపోయిన ఇంటికి రావడము జరిగినది. నిన్న మహర్షి వచ్చిపోయాడు. ఈ దినము ప్రక్క రాజ్యము యొక్క రాజు వచ్చాడు. ప్రక్క రాజ్యము యొక్క రాజు యొక్క రాకను ముందే తెలుసుకొన్న రాజు, తన పరివారములోని కొందరినికి వచ్చే రాజును ఆహ్వానించి, ఇంటిలోనికి గౌరవముగా పిలుచుక రమ్మని చెప్పాడు. అప్పుడు ఊరి బయటకు కొందరు వచ్చి రాజు కొరకు కాచుకొని ఉండిరి. కొందరు రాజు ఇంటిముందరే చెంబుతో నీళ్ళను తీసుకొని రాజు వస్తూనే కాళ్ళు కడుగుటకు సిద్దముగా ఉండిరి. అంతలో వచ్చే రాజు వచ్చాడు. రాజు

ఇంటివద్దకు వస్తూనే ఇంటి బయటే రాజు కాళ్ళను కడిగి గుడ్డతో తుడిచారట. వారు చేసిన గౌరవమునకు వచ్చిన రాజు సంతోషించాడు. ఇదంతయు చూచిన తర్వాత మనకు ఒక ప్రశ్న వస్తుంది, అదేమనగా!

"ముందు రోజు వచ్చిన మహర్షికి ఇంటిలోనికి పోయిన తర్వాత కాళ్ళు పళ్ళెములో పెట్టి కడిగారు. రెండవ రోజు వచ్చిన రాజుకు గౌరవముగా ఇంటి బయటే కాళ్ళు కడిగారు. రాజుగారి పాదములను పళ్ళెములో పెట్టి కడగనవసరము లేకున్నా, రాజు ఇంటిలోనికి వచ్చిన తర్వాత అతని పాదములను బయట కడిగినట్లే కడుగవచ్చును కదా! అలా ఒకరికి బయట మరొకరికి లోపల కడగడములో విశేషమేముంది?" అని అడుగవచ్చును. దానికి జవాబును వెదికితే ఇలా కలదు. అప్పటి కాలములోనే కాక ఇప్పటి కాలములో కూడ మన పిల్లలను కాళ్ళు కడుక్కొని ఇంటిలోనికి రావలెననీ, కాళ్ళు కడుగుకోకుండా ఇంటిలోనికి రావద్దని చెప్పుచుందుము. ఇప్పటికీ పల్లెటూర్లలో ఇంటికి బంధువు వస్తే అతనికి కాళ్ళు కడుక్కొనే దానికి నీళ్ళు, తుడుచుకొనే దానికి టవలు ఇవ్వడము జరుగుచున్నది. అలా ఇస్తే వచ్చిన వారిని గౌరవించినట్లు తలచుదురు. ప్రస్తుతము పట్టణములలో నివాసముండువారికి కొలాయిలూ, బాత్‌రూమ్‌లు ఇంటిలోపల ఉండుట వలన నీళ్ళు ఇవ్వడము అవసరమే లేకుండపోయినది. మేము చిన్న వయస్సులో ఉన్నప్పుడు ఇంటి బయటే కాళ్ళు కడుగుకోవడము ఉండేది. కాళ్ళు కడుగుకోకుండా ఇంటిలోనికి వస్తే, వానివెంట శనీశ్వరుడు వస్తాడని చెప్పేడివారు. ఇంటిబయట కాళ్ళు కడుగుకొనుట వలన, శని ఇంటిలోనికి రాకుండా బయటకు పోవునని కూడా కొందరు చెప్పేడివారు. 'నల చరిత్ర' అను గ్రంథములో నలుడు బయటనుండి ఇంటిలోనికి

వచ్చునపుడు కాళ్ళు కడుగుకొని వచ్చినా, పాదము వెనక భాగములో సూది రంధ్రమంత స్థలము తడవని దానివలన, శని దానిలో ఉండి నలుని ఇంటిలోనికి వచ్చాడనీ, తర్వాత నలచక్రవర్తిని, శని రాజ్యభ్రష్టున్ని చేసి అనేక కష్టముల పాలు చేశాడని గ్రంథములో వ్రాశారు. అందువలన పూర్వము ఎవరైనా ఇంటి బయటే కాళ్ళు కడుగుకొని రావడము ఆనవాయితీగా ఉండేది.

యోగియొక్క పాదధూళికి జ్ఞానశక్తి లేక యోగశక్తి అనునది ఉంటుంది అని తెలిసినవారు, ఆ రోజు యోగిని ఇంటిలోనికి తీసుకొని పోయి పాదములను కడిగారు. యోగికాని వాడు ఎవడైనా కానీ, రాజుకానీ అతని పాదధూళికి శని ఉంటాడు అనీ, అతని పాదములను బయటే కడగడము జరిగినది. యోగి, రాజు ఇద్దరూ వ్యక్తులే అయినా, వారిలోని తేడానుబట్టి ఒకరికి బయట, మరొకరికి లోపల కడగడము జరిగినది. పాదములను బయటే కడుగవలెననీ, అట్లు కడుగకుండా ఇంటిలోనికి రాకూడదను నియమమును అందరూ పాటిస్తున్నపుడు, అందరికీ అది ఒప్పుదల అయిన పని అయినప్పుడు, ఒక యోగికి ఆ సూత్రమును ఎందుకు పాటించలేదు? అందరికీ సూత్రమైనది. లేక అందరికీ సాంప్రదాయమైనది యోగికి ఎందుకు కాలేదు? అని అడుగవచ్చును. అయితే వారికున్న తేడానుబట్టి ఆ సూత్రము, ఆ సాంప్రదాయము అక్కడ పనికిరాలేదని చెప్పవచ్చును. అదే విధముగనే అధర్మములు జన్మను కలుగజేయునవైనా, నాలుగు అధర్మములను ధర్మవిరుద్ధములని అనకూడదు. పాదధూళికి అంటుకొని శని వచ్చునను మాటను యోగికి ఎట్లు మినహాయిస్తున్నామో, అలాగే అధర్మములకు ధర్మవిరుద్ధములను మాటవర్తించదని చెప్పుచున్నాము. ఇక్కడ మరియొక ప్రశ్న ఉత్పన్నమగుచున్నది, అదేమనగా! యోగి పాదము

లకు యోగశక్తి ఉన్నది కాబట్టి, బయట పాదములను కడుగవలెనను నియమమును యోగివద్ద మినహాయించడము జరిగినది. అయితే ఇక్కడ అధర్మములను ధర్మవిరుద్ధములు కావు అనుటకు వాటికి ఏ ప్రత్యేకతకలదని అడుగవచ్చును. దానికి జవాబు ఇలా కలదు.

ధర్మమునకు వ్యతిరేఖమైనది కర్మము అని చెప్పినపుడు యజ్ఞములు చేయుట వలన కూడా పుణ్యకర్మ వస్తున్నది కావున ధర్మము×కర్మము అయినపుడు యజ్ఞములు ధర్మవిరుద్ధమే కదా! అని అంటే యజ్ఞములు వాస్తవముగా, శాస్త్రబద్ధముగా ధర్మమునకు వ్యతిరేఖములుకావని చెప్ప వచ్చును. ఏ విధముగా చెప్పవచ్చునంటే. ధర్మ×కర్మ అయినపుడు ధర్మమునకు వ్యతిరేకము కర్మయే అగుచున్నది. ఇక్కడ సమస్య అంతా కర్మను గురించినదే అని చెప్పవచ్చును. కర్మ అనగా పాపము మరియు పుణ్యమును కలిసిన దానిని కర్మము అంటున్నాము. పాపము+పుణ్యము రెండు ఏ నిష్పత్తిలో ఉండినా దానిని కర్మ అని చెప్పవచ్చును. అన్నము మరియు సాంబారును కలిపి భోజనము అని చెప్పవచ్చును. కేవలము ఒక్క అన్నమును మాత్రము భోజనము అనము. అలాగే అన్నమును లేకుండా సాంబారును మాత్రము భోజనము అని అనము. అన్నమునూ సాంబారునూ రెండిటినీ కలిపి భోజనము అంటే ఎవరైనా ఒప్పుకొంటారు. అలాగే పాపము మరియు పుణ్యమును కలిపి చెప్పినపుడు కర్మము అని అనవచ్చును. అన్నమును మాత్రమే భోజనమని ఎట్లు అనమో, అట్లే ఒకే పుణ్యమును కర్మము అని అనము. అలాగే ఒకే పాపమును కూడా కర్మము అనము. ధర్మమునకు విరుద్ధమైనది కర్మము అయినపుడు, కేవలము పుణ్యమును తెచ్చిపెట్టు బాహ్యయజ్ఞములు ధర్మమునకు విరుద్ధములు కావు అని చెప్పవచ్చును.

ఏవైతే ధర్మమూ కాకుండా, అధర్మమూ కాకుండా ఉన్నవో అవన్నియు ధర్మవిరుద్ధ పనులుగా చెప్పబడుచున్నవి. అంతేకాకుండా పుణ్య పాపముల మిశ్రమ కర్మను తెచ్చిపెట్టుచున్నవి. మూడు ధర్మముల, నాలుగు అధర్మముల పనులను మినహాయించి మిగతా కార్యములు ఏవైతే ఉన్నవో, అవన్నీ కర్మను తెచ్చిపెట్టి జన్మకు పంపుచున్నవి. ఉదాహరణకు వ్యవసాయమును తీసుకొందాము. వ్యవసాయ కార్యములు ఇటు ధర్మమునకు సంబంధించినవీ కావు. అటు అధర్మమునకు సంబంధించినవీ కావు. అందువలన ఆ కార్యములను ధర్మవిరుద్ధమైన కర్మ కార్యములుగా చెప్పుకోవచ్చును. ఈ విధముగా అనేక రంగములలో, అనేక కార్యములు ధర్మ వ్యతిరేఖమైనవై కర్మను అంటగట్టు పనులుగా ఉన్నవి. కొందరు ఇప్పుడు మరియొక ప్రశ్నను అడుగుటకు అవకాశము కలదు. ఆ ప్రశ్న ఏమనగా! "దైవజ్ఞానమును బోధించు బోధకులు ధర్మమును ఆచరించుచున్నారా? అధర్మమును ఆచరించుచున్నారా?" అని అడుగవచ్చును. దానిని గురించిన వివరమును ఇప్పుడు చెప్పుకొందాము. దైవజ్ఞానమును బోధించువారు ఒక డ్రామా నటుడులాగ కొన్ని బోధలను నేర్వగలిగి నాటికలో బాగా నటించినట్లు, జ్ఞానము చెప్పడములో తర్ఫీదు పొంది తాను నేర్చిన దానిని బోధించుచుండును. బోధించు ఉద్యోగమును చేయువానిని టీచర్ (బోధకుడు) అని అందుము. బోధకుడు తాను బోధించు బోధను స్కూలులో పాఠములాగ బోధించితే, అది ధర్మముకాదు, అట్లే అది అధర్మముకాదు. జ్ఞానమును బోధించువాడు తన దృష్ఠిని జ్ఞానము మీద ఉంచక, ఉపన్యాసముల మీద ఉంచి, ఎదుటివారికి జ్ఞానముకావాలి, నాకు డబ్బు కావాలి కావున బోధిస్తున్నానని బోధించడమును జీతము వచ్చు ఉద్యోగము లాగ చూచుకొను వాడు ధర్మాధర్మములకు సంబంధములేని కార్యము

చేయుచున్నాడు. అందువలన అటువంటివారికి పాపపుణ్యముల మిశ్రమ కర్మము వచ్చి చేరుచున్నది. ఒక స్వామీజీ ఒక ఉపన్యాస కార్యమును చేయబూని, ఆ విషయము అందరికీ తెలియునట్లు ఫలానా స్వామీజీ భగవద్గీతను చెప్పునని తెలియునట్లు, అక్కడ ఒక బోర్డు కట్టడము జరిగినది. ఆ బోర్డులో 53వ గీతాయజ్ఞమును నక్కతిక్క స్వామీజీ 16వ తేది నుండి 26వ తేదీ వరకు నిర్వహించునని వ్రాయడము జరిగినది. స్వామీజీగానున్న ఒక వ్యక్తి భగవద్గీతను బోధిస్తున్నాను అని చెప్పకుండా గీతాయజ్ఞము చేయుచున్నానని వ్రాశాడు.

ఈ గ్రంథము ప్రారంభములోనే యజ్ఞము అను మాటకు శాస్త్రీయ మైన అర్థమును తీసుకొన్నాము. అక్కడ యజ్ఞము అనగా ఉన్నదానిని లేకుండా చేయునదనీ, నాశనము చేయునదనీ, కాల్చివేయునదనీ చెప్పు కొన్నాము. అంతేకానీ యజ్ఞము అనగా ఆరాధనయని ఎక్కడా చెప్పలేదు. బాహ్యయజ్ఞములలో కనిపించునది ఏమో అందరికీ తెలుసు. బాహ్య యజ్ఞములు దేవుడు చెప్పిన జ్ఞానమునకు నమూనాగా తయారు చేసినవని తెలియవలెను. యజ్ఞములను ఏ విధముగా చూచినా ఏదో ఒక దానిని నాశనము చేయునవిగా ఉన్నవని తెలియుచున్నది. జ్ఞానబోధకులైన స్వామీజీలు ఎక్కడైనా ఆధ్యాత్మిక జ్ఞానమును బోధించుటకు వచ్చినపుడు గతములో ఇన్నిమార్లు ఉపన్యాస కార్యమును చేశాననీ, ప్రస్తుతము ఇన్నొవ మారు చేయుచున్నాననీ, ఆ సంఖ్యను బోర్డుమీద ఇలా వ్రాయుచున్నారు. 53వ జ్ఞానయజ్ఞము ఫలానా స్వామీజీచే చేయబడుచున్నదని వ్రాయుట జరుగుచున్నది. గీతను బోధించు స్వామీజీ 53వ గీతాయజ్ఞమని వ్రాసి తాను గతములో 52 మార్లు గీతను బోధించాను, ఇప్పుడు 53వ మారు బోధిస్తున్నానని అలా తెలుపడమైనది. ఈ మధ్య కాలములో ఒక పేరున్న

స్వామీజీ తాను గతములో149 మార్లు భగవద్గీతను బోధించాననీ, ఇప్పుడు 150వ మారు చెప్పుచున్నాననీ తెలియునట్లు, 150వ గీతాయజ్ఞమును చేయుచున్నానని వ్రాశాడు. దానిని చూచిన ఒక విద్యార్థి 150వ గీతా యజ్ఞములో ప్రత్యేకముగా ఏమి వస్తువులు వేస్తారనీ, నెయ్యి ఎంత పోస్తారని నన్ను అడిగాడు. ఆ బాలుడు అడిగిన దానిలో తప్పులేదు. యజ్ఞమంటే గుంతలో అగ్నిపెట్టి, నెయ్యి మొదలగు వస్తువులను అందులో వేయుటను చూచిన ఆ విద్యార్థి, 150వ యజ్ఞమంటూనే దానిలో ప్రత్యేకత ఏమిటి అని అడగడములో తప్పులేదు. కానీ బోధలను యజ్ఞమని వ్రాసిన వారిదే తప్పు. ఆ విద్యార్థికి ఇక్కడ నెయ్యిని పొయ్యరు, వస్తువులను వెయ్యరు, భగవద్గీతను బోధించడము కొరకు వ్రాశారు అని నేను చెప్పగా, వెంటనే ఆ బాలుడు **"భగవద్గీతను 150వ మారు యజ్ఞగుండములోనికి వేస్తారా, లేక 150 భగవద్గీతలను యజ్ఞగుండములోనికి వేస్తారా"** అని అడిగాడు. ఆ మాటలు విన్న నాకు ఒక్క ప్రక్క నవ్వువచ్చినా ఆపుకొని, అతను అడగడములో తప్పులేదనుకొని ఇలా చెప్పాను. "అక్కడ ఉపన్యాసమును చెప్పు స్వామీజీ గారు ఇంతకు ముందు చాలాచోట్ల 149 మార్లు భగవద్గీతను బోధించాననీ, ఇప్పుడు 150వ మారు ఇక్కడ బోధిస్తున్నాననీ, తెలియుటకు 150వ గీతా జ్ఞానయజ్ఞమని వ్రాశాడు" అని చెప్పాను. దానికి ఆ విద్యార్థి ఆశ్చర్యముగా నావైపు చూస్తూ ఇలా అన్నాడు. "దానికి 150వ యజ్ఞమని ఎందుకు వ్రాయాలి? 150వ గీతాజ్ఞానబోధ అని వ్రాయవచ్చును కదా! చెప్పేది బోధ అయినపుడు, చేసే యజ్ఞము పేరును ఎందుకు వ్రాయాలి? 150వ గీతా జ్ఞానయజ్ఞము అంటే 150వ మారు గీతాజ్ఞానమును కాల్చుతున్నానని చెప్పినట్లు కాదా! స్వాములైనవారు అలా వ్రాస్తే ఏమీ తెలియని మేము ఎలా అర్థము చేసుకోవాలి? అయినా యజ్ఞమంటే అందరికీ

కాల్చేదని తెలిసినపుడు, యజ్ఞము కాల్చుటకొరకే చేయుచున్నట్లు ప్రత్యక్షముగా కనిపించుచుంటే, మీరు 150వ గీతా జ్ఞానయజ్ఞమని వ్రాసినపుడు, గీతను 150 మారు కాల్చుతున్నారని మేము అనుకోక ఏమని అనుకోవాలి? మీరు గీతను 150వ మారు బోధిస్తున్నారని తెలియుటకు, మీరు వ్రాసిన దానిలో ఏ ఆధారమైనా ఉన్నదా?" అని అడిగాడు. ఆ మాటలను విన్న నేను "స్వామీజీలు ఇలా చెప్పడము పొరపాటే, అలా వ్రాసివుండకూడదు. అలా వ్రాయుట వలన గీతను కాల్చుతున్నామనియే అర్థమువచ్చును తప్ప గీతను బోధిస్తున్నామను అర్థము రాదు". అని చెప్పాను.

కనిపించే యజ్ఞములు, కనిపించని యజ్ఞములు అను రెండు రకముల యజ్ఞములలో బాహ్యాముగా అందరూ చేయు కనిపించే యజ్ఞమును గురించే ఇంతవరకు చెప్పుకొన్నాము. దేవుడు యజ్ఞములను గురించి గీతలో చెప్పాడు. భగవద్గీతలో ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞము అని రెండు కనిపించని యజ్ఞముల పేర్లను చెప్పినా, ఆ రెండింటిలో ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్టమైనదని చెప్పాడు. దేవుడు చెప్పిన రెండు యజ్ఞములు శరీరము లోపల కనిపించకుండా జరుగునవి. కనిపించకుండా జరుగునవి ఎలా ఉంటాయో అందరికీ తెలియదు. కావున కొందరు జ్ఞానమును తెలిసిన పెద్దలు దేవుడు చెప్పిన కనిపించని యజ్ఞములను తమ జ్ఞానదృష్ఠి ద్వారా తెలిసినవారై సాధారణ వ్యక్తులకు యజ్ఞము అంటే ఇట్లుంటుందని తెలుపు నిమిత్తము బాహ్యాముగా యజ్ఞగుండమును తయారు చేసి, అందులో అగ్నివేసి, దానిలోనికి అనేక రకముల వస్తువులు, నూనెలు, వస్త్రములు, ఔషధములు, లోహములను వేసి కాల్చి చూపెడివారు. అలా చూపడము వలన యజ్ఞమంటే ఇట్లుంటుందను నమూనా మనిషికి తెలిసిపోవుచున్నది.

మొదట యజ్ఞము యొక్క నమూనా దృశ్యమును చూచిన తర్వాత యజ్ఞమంటే ఏమిటి? దానిలోని అగ్ని దేనికి గుర్తు? అగ్నిలోనికి వేయు వస్తువులు దేనికి గుర్తు? యజ్ఞములను చేయు రుత్వికుడు ఎవరికి గుర్తు? అని బాహ్య యజ్ఞములలోని అన్నింటి జ్ఞానమును తెలియగల్గితే, శరీరాంతర్గములో జరుగు యజ్ఞముల వివరము తెలిసిపోవును. దేవుడు శరీరములో జరుగు జ్ఞాన యజ్ఞమును గురించి భగవద్గీతలో వివరముగా చెప్పగా, దేవుడు యజ్ఞమును గురించి చెప్పాడని చాలామంది గుర్తించలేకపోయారు. జ్ఞానము మీద శ్రద్ధగలిగిన బహుకొద్దిమంది మాత్రము శరీరములోని జ్ఞానయజ్ఞమును దేవుడు చెప్పినట్లు గ్రహించగలిగారు. శరీరాంతర్గత జ్ఞాన యజ్ఞమును గ్రహించిన జ్ఞానులు దానిని మనుషులకు బోధించుటకు, దేవుడు చెప్పిన జ్ఞానయజ్ఞమువలెనున్న బయట యజ్ఞమును తయారు చేసి చూపారు. బాహ్య యజ్ఞములోని ప్రతి విషయమునకు లోపలియజ్ఞము యొక్క పోలికను చెప్పడము వలన, భగవద్గీతలో చెప్పిన జ్ఞానయజ్ఞము పూర్తిగా మనుషులకు అర్థమైపోవునని తలచారు. అట్లు తలచినవారు బాహ్యయజ్ఞములను తయారుచేసి వాటిని మండించి, అందులోనికి సమిధలను మంత్రము చెప్పుచూ వేసి చూపడము జరిగినది. మొత్తము మీద సూక్ష్మముగానున్న యజ్ఞమును స్థూలముగా చూపడము జరిగినది. ఆనాడు మంచి ఉద్దేశ్యముతో తయారు చేసిన బాహ్యయజ్ఞము నేటికినీ ఉన్నా, అది శరీరాంతర్గత జ్ఞానయజ్ఞమునకు నమూనాగా చేయబడినదని ఎవరికీ తెలియకుండా పోయినది. దేవుడు చెప్పిన మూడు ధర్మముల సారాంశమైన జ్ఞానయజ్ఞము పూర్వమే త్రేతాయుగములోనే అర్థము తెలియని బాహ్య యజ్ఞముగా మారిపోయి నాలుగు అధర్మములలో ఒకటయినది.

భగవద్గీతలో దేవుడు తెల్పిన శరీరాంతర్గత జ్ఞానయజ్ఞమును గ్రహించిన జ్ఞానులు, ప్రజలకు జ్ఞానయజ్ఞమును గురించి తెలుపు నిమిత్తము బాహ్యాయజ్ఞములను తయారు చేసి చూపాలనీ, ఆ విధముగా నమూనాను చూపడము వలన శరీరములోని జ్ఞానయజ్ఞమును ప్రజలు సులభముగా తెలియగలరనీ, మంచి భావముతో అనుకొనినా, ఆ ప్రయత్నము సఫలము కాకుండా విఫలమై పోయినది. శరీరములోని ధర్మము శరీరము బయట అధర్మముగా తయారైనది. అయినా ఆనాటి జ్ఞానులు మంచి ఉద్దేశ్యముతో తయారు చేసిన బాహ్యాయజ్ఞము, జ్ఞానయజ్ఞము యొక్క నమూనా కాకుండా, అజ్ఞాన యజ్ఞనమూనా అయిపోయినది. జ్ఞానులు మంచి భావముతో చేసిన కార్యము అలా విఫలమైపోయి, అధర్మయుక్తమైపోవుటకు కారణము ఏమైవుండవచ్చునని యోచిస్తే, ఇంతవరకు జ్ఞానులు సహితము గుర్తించని ఒక విషయము తెలియుచున్నది, అదేమనగా!

దేవుడు భగవద్గీతలో శరీరమునందు కనిపించకుండా జరుగు జ్ఞాన యజ్ఞమును తెల్పినపుడే, జ్ఞానయజ్ఞము వివరముగా తెలియుటకు ధర్మమునకు సంబంధములేనిదైన ద్రవ్యయజ్ఞమనబడు దానిని నమూనాగా చెప్పాడు. దేవుడు తెల్పిన ద్రవ్యయజ్ఞము యొక్క నమూనానుబట్టి జ్ఞాన యజ్ఞమును ఎవరైనా తెలియవచ్చుననీ, ఆనాడు గీతలోనే ద్రవ్యయజ్ఞము యొక్క ప్రస్తావన వచ్చినది. జ్ఞానయజ్ఞమును మనుషులు అర్థము చేసుకొను నిమిత్తము, ద్రవ్యయజ్ఞమును పోలికగా దేవుడే తన గీతయందు తెలిపాడని గ్రహించని జ్ఞానులు, తమ స్వంత ప్రయత్నముగా బాహ్యాయజ్ఞమును తయారు చేశారు. అయితే బాహ్యాయజ్ఞము పూర్తి మానవ ప్రయత్నమే అగుట వలన, అది వారి భావము ప్రకారము ప్రజలకు అర్థము కాకుండాపోయి, నేడు ప్రపంచములో అధర్మమైకూర్చున్నది. దేవుడు జ్ఞానయజ్ఞమునకు పోలికగా

ద్రవ్యయజ్ఞమును చెప్పాడు. అయితే ఆ పోలికను మనిషి గ్రహించక, తానే స్వయముగా జ్ఞానయజ్ఞమునకు పోలికగా బాహ్యయజ్ఞమును తయారు చేశాడు. దేవుడు చెప్పిన ద్రవ్యయజ్ఞ పోలిక, మనిషి చెప్పిన బాహ్యయజ్ఞ పోలిక రెండూ ఒకే విధానమును తెల్పుచూ, ఒకే విధ పోలికగా ఉన్ననూ, ద్రవ్యయజ్ఞమును మనిషి గుర్తించలేదు. మనిషి బాహ్యయజ్ఞమును గుర్తించినా, దానిని జ్ఞానయజ్ఞ పోలికగా గ్రహించలేదు.

ఇదంతయు బాగా యోచించు బుద్ధితో చూడగలితే, అసలైన జ్ఞాన యజ్ఞము ఒకటే అయితే, దానికి దేవుడు చెప్పిన నమూనా ఒకటి, మనిషి చెప్పిన నమూనా ఒకటి గలవు. అసలైన జ్ఞానయజ్ఞమును ప్రక్కనపెట్టి దేవుడు మరియు మనిషి చెప్పిన పోలికలను వివరముగా చూస్తాము. దేవుడు చెప్పిన ద్రవ్యయజ్ఞము పేరు భగవద్గీతలో జ్ఞానయోగమునందు 33వ శ్లోకమున చెప్పబడియున్నది.

శ్లో॥ : శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప! ।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥

ఈ శ్లోకములో ద్రవ్యయజ్ఞము మరియు జ్ఞానయజ్ఞము అను రెండు పేర్లు వచ్చినవి. ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనదని కూడా ఈ శ్లోకములో చెప్పడమైనది. ఇక్కడ రెండు యజ్ఞముల పేర్లను చెప్పి అందులో ఒకటి శ్రేష్ఠమైనదని దేవుడు ఎందుకు చెప్పాడు. శరీరములో యజ్ఞములున్నాయనిగానీ, వాటికి పేర్లున్నాయనిగానీ, మనిషికి ఏమాత్రము తెలియనపుడు రెండు యజ్ఞముల పేర్లను చెప్పి, అందులో ఒకటి గొప్పదని చెప్పడములోనున్న రహస్యమేమిటి? అలా రెండు పేర్లను చెప్పకుండా ఒకే జ్ఞానయజ్ఞము పేరును దేవుడు చెప్పియుండవచ్చును కదా! ఫలానిది ఉంది

అని తెలియనప్పుడు, దానికి నమూనాగా ద్రవ్యయజ్ఞమును గురించి చెప్పవలసిన అవసరమేమి వచ్చినదని ప్రశ్నించుకొని చూస్తే ఈ విధముగా అర్థమగుచున్నది. ఒకే పోలికలున్న ఇద్దరు కవల పిల్లలున్నప్పుడు, వారిలో ఎవరు పెద్ద అని గుర్తించుటకు వీలు లేకుండును. ఒకే పోలికవున్న రెండు వజ్రములున్నప్పుడు ఏది నకిలీ, ఏది అసలు అని చెప్పుటకు వీలులేకుండును. ఇట్లు ఎక్కడైనా రెండు వస్తువులు ఒకే విధముగా ఉన్నప్పుడు, ఏది గొప్పదని గానీ, లేక ఏది పెద్ద అనిగానీ, ఏది శ్రేష్ఠమనిగానీ తెలియుటకు అందరికీ చేతగాదు. అయితే రెండు వస్తువులను తయారు చేసినవానికి మాత్రము వాటిలోని తేడా తెలిసివుండును. రెండు వస్తువులను సృష్ఠించిన వాడు వాటిలో ఏది గొప్పనో, ఏది గొప్పకాదో తెలిసివుండును. ఇప్పుడు దేవుడు రెండు యజ్ఞముల ప్రస్తావన ఎందుకు తెచ్చాడో, బాగా అర్థము కావాలంటే ఒక చిన్న ఉదాహరణను చెప్పుకొందాము.

ఒక మారుమూల గ్రామములోని కంసాలి (బంగారు నగలు చేయు ఆచారి) ప్రపంచములో ఎవరూ తయారు చేయని మరియు చేయలేని బంగారుహారమును తయారు చేశాడు. ఆ బంగారుహారములో నవరత్నము లను అమర్చాడు. తొమ్మిది రత్నములను అమర్చునపుడు ఒకవైపు జ్యోతిష్య శాస్త్రమునూ, మరొకవైపు బ్రహ్మవిద్యాశాస్త్రమును అనుసరించి తొమ్మిది రత్నములను బంగారుహారములో అమర్చాడు. రెండు శాస్త్రముల కలయికతో నవరత్నములను హారములో అమర్చడము వలన హారమునకు ఒక శక్తి ఏర్పడినది. జ్యోతిష్యశాస్త్రము ఆధారముతో కర్మలను కట్టెలనూ, బ్రహ్మ విద్యాశాస్త్రముతో కర్మను నాశనము చేయు జ్ఞానాగ్నినీ, హారములోనికి వచ్చునట్లు చేయడము వలన ఆ హారము ప్రత్యేకమైన హారమైనది. కంసాలి ఎంతో నేర్పుతో హారమును చేయగా, దానిని ధరించిన వారికి వారిలోని

రోగములు లేకుండపోయి ఆరోగ్యము చేకూరు శక్తి వచ్చినది. హారములో శక్తి ఉన్నదని హారమును తయారు చేసిన కంసాలికి తెలుసు. తయారు చేసిన కంసాలి దానిని ఎక్కడో ఒకచోట, ఎవరికో ఒకరికి అమ్మివేయాలను కొన్నాడు. దానిని కొన్నవాడు రోగములనుండి బయటపడగలడని తెలిసిన కంసాలి, ఆ విషయమును బయట ప్రజలందరికీ తెలిపాడు. అయితే హారమునకు ఒక నియమముకలదు. ఆ నియమము ప్రకారము హారము ఆచారి (కంసాలి) ఇంటిలోనైనా ఉండాలి, లేకపోతే కొన్నవాని ఒంటి మీదైనా ఉండాలి. అట్లుకాకుండా దానిని అన్ని ఊర్లకు తిప్పకూడదు. అందరి చేతులు తగలకూడదు. అటువంటి నియమము ఉండుట వలన దానిని తయారు చేసిన కంసాలి దానిని ఇతరులకు చూపి అమ్మాలంటే చూచేవారు ముట్టుకోకూడదు. అంతేకాక వేరే ఊర్లకు పోయి ప్రజలకు చూపించి అమ్ముకోవాలంటే దానిని ఇంటిలోనే ఉంచాలి, బయట ప్రదేశము లోనికి తీసుకపోకూడదు. దానివలన కంసాలి ఒక ఉపాయమును వెదకి అదే ఆకారమున్న మరొక నకిలీ హారమును తయారు చేశాడు. మొదటి హారమువలె నకిలీ నవరత్నములను ఉంచాడు. మొత్తానికి నకిలీ హారము బంగారుది కాకున్నా, దాని రత్నములు అసలైనవి కాకున్నా చూచేదానికి మాత్రము అన్ని విధముల మొదటిహారమువలె ఉన్నది. నకిలీ హారమునకు శక్తీలేదు, నియమములు లేవు. కావున దానిని ఏ ఊరికైనా తీసుకు పోవచ్చును, ఎవరికైనా చూపవచ్చును.

కంసాలి తాను చేసిన అసలైన మొదటి హారమును ఇంటిలో భద్రముగావుంచి, మొదటి హారమువలెనున్న నకిలీ హారమును తీసుకొని ఊరూరు తిరిగి, దానికి ఉన్న ప్రత్యేకమైన శక్తిని గురించి చెప్పి ప్రత్యక్షముగా హారమును చూపుచుండెను. కంసాలి చాలారోజులు, చాలా ఊర్లు తిరిగి

తాను తయారు చేసిన హారమును అమ్మాలని ప్రయత్నించినా, దానిని ఎవరూ కొనలేదు. ఆచారి (కంసాలి) శ్రమపడుటను చూచిన కొందరు తమకు పరిచయమున్నవారికి ఆచారి హారమును గురించి చెప్పి, దానిని ఎవరైనా కొనమని చెప్పుచుండిరి. అయితే ఆచారి తన హారమును స్థానిక భాషలో హారము అనకుండ దండ అని చెప్పుచుండెను. ఆచారి దండను అమ్మించా లని ప్రయత్నము చేయుచున్న ఇతరులు, దండను గురించి ఇతరులకు చెప్పునపుడు దండ అని అనకుండా దండము అని చెప్పెడివారు. దానితో విన్నవారందరు ఆచారి దండమును అమ్ముతాడని అనుకొన్నారు. వాస్తవానికి కంసాలి అమ్మదలచుకొన్నది దండ అయితే, కొనదలచుకొన్నవారు ఆచారి అమ్మునది కట్టె అని అనుకొన్నారు. దండము అనగా కట్టె అని అర్థముండుట వలన, ఇతరులు చెప్పడములో దండము అని చెప్పుట వలన, అర్థము అపార్థమైపోయినది. చివరకు దండ (హారము) తెలియకుండాపోయి కొందరికి దండము తెలిసినది. కంసాలి హారమును చేసి, దానిని తెల్పుటకు నకిలీ హారమును చేయగా, దానిని ప్రచారము చేయువారు దండ బదులు దండమును ప్రచారము చేశారు. అసలైన హారమును కొందరికి చూపించు టకు ఆచారి నకిలీ హారమును చేయగా, ఇతరులు దానిని మాటలలో చెప్పుచూ దండను దండము (కట్టె) చేశారు. దానితో హారము తెలియకుండా పోయినది.

కంసాలి మహిమగల హారమును చేసి దానిని ఇతరులకు చూపుటకు నకిలీ హారమును చేయగా, ఇతరులు అదే హారమును గురించి దండము అని చెప్పారు. ఈ విధముగా ఒకే హారము నకిలీ దండగా మారి, తర్వాత దండముగా చెప్పబడుచున్నది. ఇదంతా ఎలాగున్నదనగా! కంసాలి

రోగమును పోవునట్లు చేయు మహిమగల హారమును తయారు చేసినట్లు, దేవుడు కర్మను నిర్మూలించు జ్ఞానయజ్ఞమును శరీరములోనే నిర్మించాడు. కంసాలి తన శక్తిగల హారమును బయటికి తీయకుండ, దానిని ఇతరులకు చూపి తెలియునట్లు చేయుటకు, నకిలీ హారమును తయారు చేసినట్లు, దేవుడు కూడా జ్ఞానయజ్ఞమను దానిని ఇతరులకు అర్థమగునట్లు చేయుటకు, ద్రవ్యయజ్ఞమను నకిలీ యజ్ఞమును కూడా శరీరములోనే తయారు చేసి యుంచాడు. ద్రవ్యయజ్ఞమును తెలియగలిగితే, కర్మను లేకుండా చేయు జ్ఞానయజ్ఞము సులభముగా తెలియునను ఉద్దేశ్యముతో, కంసాలి నకిలీ దండను తయారు చేసినట్లు, దేవుడు జ్ఞానయజ్ఞమును తెలుపు నిమిత్తము ద్రవ్యయజ్ఞమును తయారు చేశాడు. కంసాలి చేసిన నకిలీ దండను ప్రచారము చేయుట కొరకు ఇతరులు ప్రయత్నించి దండను దండముగా చెప్పినట్లు, దేవుడు చెప్పిన యజ్ఞమును ప్రచారము చేయుటకు మనిషి ప్రయత్నించి బాహ్యయజ్ఞమును తయారు చేశాడు. కంసాలి చేసి అమ్మదలచుకొన్న హారము చివరకు ఇతరుల జోక్యముతో హారముపోయి చివరకు దండము అయినట్లు, దేవుడు సృష్టించిన జ్ఞానయజ్ఞము, జ్ఞానుల బోధలతో మారిపోయి చివరికి బాహ్యయజ్ఞముగా తయారైనది. కంసాలి శక్తిగల హారమును తయారు చేసి దానిని చూపుటకు, దానికి బదులుగా అలాంటిదే నకిలీ హారమును చేసినా, మధ్యలో మనుషుల జోక్యముతో ఇతరులకు నకిలీ హారము కూడా తెలియకుండా పోయి, మూరెడు హారమునకు బదులుగా ఏమాత్రము సంబంధములేని మూరెడు కట్టెగా తెలియబడింది. ఇది చాలా విచిత్రముగా ఉన్నది కదా! ఇదే విధముగా దేవుడు జ్ఞానయోగమును తెలుపు నిమిత్తము ద్రవ్యయజ్ఞమను పేరును తన శ్లోకములో చెప్పితే, మన బోధకులందరూ ద్రవ్యయజ్ఞమును పూర్తిగా వదలి,

చివరకు ద్రవ్యములు ఖర్చగు బాహ్యాయజ్ఞమును అందరికీ అర్థమగునట్లు చేశారు.

కంసాలి హోరము యొక్క వ్యాపారము ఎవరికీ తెలియకుండా పోవడమేకాక, చివరకు దేశమంతా ఆచారిది కట్టెల వ్యాపారమని ప్రచారమై పోయినది. అలాగే దేవుడు జ్ఞానయజ్ఞము తెలుపుటకు నమూనాగా ద్రవ్య యజ్ఞమును చెప్పితే, చివరికది ఆచారి దండ, దండము అయినట్లు, ద్రవ్య యజ్ఞము చివరకు ద్రవ్యములతో చేయు బాహ్యాయజ్ఞమైనది. నేడు భూమి మీద ఎవరు చేసినా, ఏ పేరు పెట్టి చేసినా, ఎక్కడ చేసినా ద్రవ్యములను ఖర్చుచేయు బాహ్యాయజ్ఞములనే చేయుచున్నారు. త్రేతాయుగమునుండి బాహ్యాయజ్ఞములను చేయుటకు పూర్తిగా మనిషి అలవాటుపడిపోయాడు. దేవుడు చెప్పిన జ్ఞానమునుకాదని, ఆయన చెప్పిన జ్ఞానయజ్ఞమును పూర్తిగా మరిచిపోయి, మనిషి తన స్వంత తెలివితో చేయు బాహ్యాయజ్ఞములను చూచిన త్రికాలజ్ఞాని, బ్రహ్మజ్ఞాని అని పేరుగాంచిన వ్యక్తి, మనుషులు చేయు బాహ్యాయజ్ఞములను పూర్తి వ్యతిరేఖిస్తే ఆయనను రాక్షసుడన్నారు. దేవుడు చెప్పిన జ్ఞానయజ్ఞమును వదలి, దానికి వ్యతిరేఖముగా ద్రవ్యములను ఖర్చుచేయు బాహ్యాయజ్ఞములను చేయవద్దని చెప్పినవాడు రాక్షసుడైతే, అజ్ఞానముతో కూడుకొని ఏమాత్రము జ్ఞానములేనిదై, దేవుని ధర్మముకానిదైన బాహ్యాయజ్ఞమును చేయువారు దేవతలవుతారా? మీరే యోచించండి. దేవుడు తన భగవద్గీతలో మనిషియొక్క కర్మపోవు విధానములను మూడు యోగములుగా చెప్పితే, దేవుడు చెప్పిన మూడు యోగములలో కర్మకాలిపోవు కర్మయోగము ఒక ధర్మముకాగా, బ్రహ్మయోగము రెండవ ధర్మముకాగా, భక్తియోగము మూడవ ధర్మముగా ఉన్నది. ఈ మూడు యోగములలో జీవుని కర్మనాశనము తప్ప మరి ఏమీ లేదు. జీవునికర్మ నాశనమగు

మూడు విధానములను కలిపి జ్ఞానయజ్ఞమని ఒక పేరుగా చెప్పడమైనది. ముగ్గురు వ్యక్తులు విడివిడిగా మూడుచోట్ల అగ్నిపెట్టి కట్టెలను కాల్చారనుకొనుము. అప్పుడు ముగ్గురు చేసినది ఒకే పనియగును. కావున ఆ ముగ్గురి పనిని ఒకే పేరుతో "కట్టెల దహనము" అని చెప్పవచ్చును కదా! అలాగే మూడు వేరువేరు యోగములలో కర్మలు కాలిపోవడమును గీతలో దేవుడు "జ్ఞానయజ్ఞము" అని ఒకే పేరుతో చెప్పడమైనది.

ఒక మనిషి ఒక యోగమును ఆచరించినా లేక రెండు యోగములు ఆచరించినా, దానిని జ్ఞానయజ్ఞము చేయడమనియే చెప్పవచ్చును. అట్లే మూడు యోగములను చేసినా, ఒక యోగమును చేసినా కర్మనశించు విధానమును జ్ఞానయజ్ఞముగా భగవద్గీతలో చెప్పడమైనది. భగవద్గీతలో మూడు ధర్మములైన మూడు యోగములలో, ఏ ఒక్క యోగము వలన కర్మ కాలిపోయినా, దానిని యజ్ఞము అనియు ప్రత్యేకించి జ్ఞానయజ్ఞము అనియు చెప్పబడినది. **అగ్ని ఉన్నచోటంతా కాలిపోతుందన్నట్లు కర్మకాలిపోవు విధానము ఎక్కడున్నా అక్కడ జ్ఞానమను అగ్నితో, కర్మలను కట్టెలు కాలిపోవుచున్నవి. జ్ఞానము అగ్నియై, కర్మలు కట్టెలైనపుడు దానిని జ్ఞానయజ్ఞము అని అనవచ్చును.** యోగము అను గుండములో, జ్ఞానము అను అగ్నిలో, కర్మలను సమిధలు (పాపపుణ్యమగు కట్టెలు) కాలి, లేకుండా పోవడమును జ్ఞానయజ్ఞము అని దేవుడు చెప్పినట్లు అర్థమైనది. ఈ విషయమును భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున 37వ శ్లోకమున ఇలా చెప్పారు.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**భావము :-** ఏ విధముగా అగ్నిలో కట్టెలు కాలిపోవుచున్నవో, అదే విధముగా

జ్ఞానమను అగ్నిలో సర్వ కర్మలు కాలి బూడిదైపోవుచున్నవి. ఈ శ్లోకములోని భావమును చూస్తే ఇది పూర్తి జ్ఞానయజ్ఞమునకు సంబంధించిన విషయమని తెలిసిపోవుచున్నది. ఇదే అధ్యాయములో 33వ శ్లోకమున ద్రవ్యయజ్ఞము కంటే జ్ఞానయజ్ఞము శ్రేష్టమైనదని చెప్పడమైనది. ఈ రెండు యజ్ఞములకు దేవుడే పేరు పెట్టాడు. ఈ రెండు యజ్ఞములు దేహములోనే జరుగుచున్నవి. ఈ రెండు యజ్ఞములకు అధిపతి శరీరమునకు అధిపతి యైన ఆత్మయే. ఇదే విషయము భగవద్గీతలో అక్షరపర బ్రహ్మ యోగమను అధ్యాయమున గల 4వ శ్లోకములో గలదు.

శ్లో॥ అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధి యజ్ఞోహమే వాత్ర దేహేదేహా భృతాంవర ॥

ఈ శ్లోకములో శరీరమునకు అధిపతిగానున్న ఆత్మనైన నేను శరీరములో జరుగు యజ్ఞములకు అధిపతిగా ఉన్నానని చెప్పాడు. దీనినిబట్టి యజ్ఞములకు అధిపతి ఆత్మయనీ, యజ్ఞములు శరీరములోనే జరుగుచున్న వనీ తెలియుచున్నది. శరీరములో జరుగు ప్రతి కార్యము జీవుని వలన జరగడము లేదు. శరీరమున జరుగు బయట ఇంద్రియముల పనిగానీ, లోపలి ఇంద్రియముల పనిగానీ, శరీరమునకు అధిపతిగానున్న ఆత్మయే చేయుచున్నది. ముఖ్యముగా జీవుడు ఏమీ చేయడము లేదని జ్ఞప్తిలో ఉంచుకోవలెను. ద్రవ్యయజ్ఞముగానీ, జ్ఞానయజ్ఞముగానీ శరీరములోనే జరుగు చున్నవి. అయితే ద్రవ్యములను అగ్నిలో కాల్చు బాహ్యాయజ్ఞము మాత్రము శరీరము బయట జరుగుచున్నది. దేవుడు చెప్పిన రెండు యజ్ఞములలో ద్రవ్యయజ్ఞము శరీరమందు ఉదరభాగములోని జీర్ణాశయములో జరుగుచున్నది. జ్ఞానయజ్ఞము తల భాగమందుగల గుణచక్రములో జరుగుచున్నది.

శక్తిగలది ప్రపంచమునకంతటికీ ఒకే ఒక యజ్ఞము కలదు. ఏ విధముగా కంసాలివద్ద శక్తిగల హారము ఒకటే ఉన్నదో, ఆ విధముగా జ్ఞానశక్తిగల యజ్ఞము ఒకటే గలదు. అదియే జ్ఞానయజ్ఞము. ఆచారి (కంసాలి) వద్ద మరియొక నకిలీ హారమున్నట్లు, దేవుడు చెప్పినది, చేసినది మరొక ద్రవ్యయజ్ఞము కలదు. జ్ఞానయజ్ఞమునకు నకిలీ యజ్ఞముగా ద్రవ్యయజ్ఞము కలదని చెప్పవచ్చును. ప్రపంచములోనున్నవి రెండే రెండు యజ్ఞములైతే అందులో ఒకటి అసలుది, రెండవది నకిలీది. ప్రపంచమున కంతటికీ గల ఏకైక అసలు యజ్ఞము జ్ఞానయజ్ఞముగలదు. దేహములో గల అసలు, నకిలీ రెండు యజ్ఞములలో నకిలీ యజ్ఞమైన ద్రవ్యయజ్ఞమును ఆత్మయే చేయుచున్నది. అసలైన జ్ఞానయజ్ఞమును శరీరములోని జీవుడు చేయవలసివుండగా, జీవుడు చేయడములేదు. ప్రపంచమునకంతటికీ ఉన్న ఒకే ఒక యజ్ఞమును జీవుడు చేయుటకు నిర్మించగా, జీవుడు చేయడము లేదు. శరీరములో తలయందు గల జ్ఞానయజ్ఞము వద్ద యజ్ఞములో వేయవలసిన సమిధలు పేరుకొనిపోయి ఉన్నాయి. అయితే జ్ఞానయజ్ఞమును చేయవలసిన రుత్వికుడైన జీవుడు యజ్ఞము ధ్యాసలోనికే పోకుండా నిద్రపోవుచుండగా, యజ్ఞగుండములో అగ్ని ఏమాత్రము లేదు. రుత్వికుడైన జీవుడు యోగమును ఆచరించి, జ్ఞానమను అగ్నిని రగిలించి, కర్మలను కట్టెలను కాల్చవలసివుండగా, గుండములో అగ్ని లేదు, రుత్వికుడు గుర్రుపెట్టి నిద్రపోవుచున్నాడు. ప్రపంచమునకంతటికీ ఒకే ఒక యజ్ఞముగా నున్న జ్ఞానయజ్ఞము, ఈ విధముగా చేయువారు లేక ఆరిపోయివున్నది.

బయట ప్రజలు తెలుసుకొనునట్లు ద్రవ్యయజ్ఞమును దేవుడే తయారు చేశాడు. కనుక ద్రవ్యయజ్ఞమును చూచైనా జ్ఞానయజ్ఞము చేయగలరను భావముతో, ఆత్మ ప్రతి దినము ద్రవ్యయజ్ఞమును చేయుచున్నది. శరీరములో

జీర్ణాశయమున ఆత్మ అధిపతిగా ఉండి, ఆత్మే చేయు ద్రవ్యయజ్ఞమును మనుషులు ఎవరూ గమనించలేదు. ద్రవ్యయజ్ఞము సర్వసాధారణముగా జరుగు పనియని దానిని తేలికగా భావించారు. ప్రతి దినము జరుగు ద్రవ్యయజ్ఞము తాము చేయకున్నా, శరీరములో ఎవరు చేయుచున్నారని మనిషి ఏమాత్రము యోచించడము లేదు. మనిషి పుట్టినప్పటి నుండి, తన శరీరము మీద తనకు ధ్యాసరాని శిశుదశనుండి, శరీరములోని ద్రవ్యయజ్ఞమును జీవాత్మకు సంబంధములేకుండా ఆత్మ చేయుచునే ఉన్నది. శరీరములో అసలైన జ్ఞానయజ్ఞమునకు నమూనాగావున్న నకిలీ యజ్ఞమైన ద్రవ్యయజ్ఞము నిత్యమూ జరుగుచున్నప్పుడు, కనీసము జీవితములో ఒక రోజైనా దానిని గురించి మనిషి ఆలోచించలేదు. సాధారణ మనిషియే కాకుండా జ్ఞానులమనుకొనువారు గానీ, స్వామీజీలు గానీ, పీఠాధిపతులు, హంసలు, పరమహంసలు అయిన వారు ఎవరైన గానీ అసలైన జ్ఞానయజ్ఞమునకు నమూనాగానున్న తమ శరీరములో జరుగు ద్రవ్యయజ్ఞమును గమనించడము లేదు.

దేవుడు తన జ్ఞానములో చెప్పినదీ, శరీరములో కర్మను నాశనము చేయునదీ, ఒకే ఒక జ్ఞానయజ్ఞము కలదు. అది ప్రతి మనిషికీ ఉన్నదే, అది అర్థమగుటకు ప్రతి మనిషియందు ద్రవ్యయజ్ఞమును నమూనాగా యుంచినా, ఏ మనిషీ ద్రవ్యయజ్ఞమును కూడా గ్రహించలేదు. మనిషి ఏ మతములో ఉన్నా అతనికి ద్రవ్యయజ్ఞము నిత్యమూ జరుగుచున్నది. జ్ఞానయజ్ఞమునకు నమూనాగాయున్న ద్రవ్యయజ్ఞమును గురించి పూర్తిగా తెలుసుకొంటే ఈ విధముగా కలదు. యజ్ఞము అనగా కాల్చివేయునదని తెలుసుకొన్నాము. ద్రవ్యయజ్ఞమనగా ద్రవ్యములను కాల్చివేయునదని అర్థము. ద్రవ్యయజ్ఞము మన శరీరములోని జీర్ణాశయములో జరుగుచున్నది.

జీర్ణము అనగా నాశనము అని అర్థము. జీర్ణాశయము అనగా నాశనము చేయడమే ఆశయముగా లేక అభి(ప్రాయముగా కలది. నాశనము చేయడమే పనిగా లేక అభి(ప్రాయముగా కల్గిన జీర్ణాశయములో ఏది పడినా అది జీర్ణమైపోవును. జీర్ణాశయములో పడిన దేనినైనా నాశనము చేయగలది ఒకటున్నది. అదియే జఠరాగ్ని. జఠ అనగా కడుపు, జఠరాగ్ని అనగా కడుపులోని అగ్ని. జీర్ణాశయములోని అగ్ని అక్కడకు వచ్చిన అన్నిటినీ కాల్చివేయుచున్నది. శరీరమునకు అధిపతియైన ఆత్మ వలన ఊటలుగావచ్చు రసముల కలయికలో (ద్రవ్యములను కాల్చివేయు సామర్థ్యమున్నది. మూడు రసముల కలయిక అగ్నిబలమును కలిగి జీర్ణాశయములో (ద్రవ్యములను నాశనము చేయుచున్నది. ఆత్మ వలన వచ్చు ఊటల అగ్ని జీర్ణాశయము లోనికి వచ్చిన నాలుగు రకాల ఆహారపదార్థములను జీర్ణము చేయుచున్నది. 1) పిండిపదార్థములు 2) మాంసకృత్తులు 3) ఖనిజ లవణములు 4) కొవ్వు పదార్థములు అను నాలుగు రకముల ఆహారములను జఠరాగ్ని కాల్చివేయుచున్నది. (ప్రతి దినము మనిషి జీర్ణాశయములో ఒక రోజుకు మూడుమార్లు లేక నాలుగు మార్లు (ద్రవ్యయజ్ఞము జరుగుచున్నదని చెప్ప వచ్చును. ఇదే విషయమునే భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగములో 14వ శ్లోకమునందు చెప్పబడినది.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

**భావము :-** "నేను సకల జీవరాసుల శరీరములందు అగ్నినైయుండి వారు భుజించిన నాలుగు రకముల ఆహారపదార్థములను జీర్ణము చేయుచున్నాను." అని శరీరములోని ఆత్మ చెప్పుచున్నది. ఆత్మ తన రసాయనిక ఆమ్లముల

చేత దేనినైనా జీర్ణము చేయు అగ్నిశక్తి కలదైవుండి, మనుషులు ఆహారముగా తీసుకొను ఏ ఆహారమునైనా నాలుగు రకములుగా విభజించి కాల్చివేయు చున్నది. ప్రతి దినము జీర్ణాశయములో జరుగుచున్న పనియే ద్రవ్యయజ్ఞము. ఈ ద్రవ్యయజ్ఞ విధానమంతయు తలయందుగల జ్ఞానయజ్ఞమునకు పోలికగా ఉన్నది. అయితే ఆ పోలిక ప్రకారము పని జరగడములేదు. ద్రవ్యయజ్ఞము యొక్క నమూనాగా జరిగితే జ్ఞానయజ్ఞము ఇలా ఉండును. తలలోని నాలుగుచక్రముల సముదాయములో క్రిందినుండి ఒకటవ చక్రమైన గుణ చక్రమందు జ్ఞానయజ్ఞము జరుగుచున్నది. గుణచక్రములో జీవుడు నివాస మున్నాడు. జీవుడు గుణముల సంబంధముతో చేయు కార్యముల వలన పాపపుణ్యములు రెండూ కలిసిన కర్మ వస్తున్నది. రెండు భాగములైన కర్మ, ఐదు జ్ఞానేంద్రియముల జ్ఞానము ద్వారా వస్తున్నది. మనిషి చేయు కార్యముల వలన వచ్చు కర్మ ఐదురకములుగా వచ్చుట వలన, జ్ఞానయజ్ఞములో కాలిపోవునవి ఐదు ఇంద్రియముల జ్ఞానములని చెప్పవచ్చును. ఐదు రకముల ప్రపంచ సంబంధ జ్ఞానములు కాలిపోవుట వలన, ఈ కార్యమును జ్ఞానయజ్ఞము అని అంటున్నాము. ద్రవ్యయజ్ఞములో నాలుగు ద్రవ్యములు కాలిపోతే, జ్ఞానయజ్ఞములో ఐదు జ్ఞానములు కాలిపోవుచున్నవి. ద్రవ్య యజ్ఞములో కాలునవి నాలుగు ఆహార ద్రవ్యములుకాగా, జ్ఞానయజ్ఞములో కాలిపోవునవి ఐదు ప్రపంచ జ్ఞానములు. ద్రవ్యయజ్ఞములో 1) పిండి పదార్థములు 2) మాంసకృత్తులు 3) ఖనిజ లవణములు 4) కొవ్వు పదార్థములు జీర్ణము కాగా (కాలిపోగా), జ్ఞానయజ్ఞములో 1) కన్ను చూపు జ్ఞానము 2) చెవి వినికిడి జ్ఞానము 3) నాలుక రుచి జ్ఞానము 4) ముక్కు వాసన జ్ఞానము 5) చర్మము స్పర్శ జ్ఞానము కాలిపోవుచున్నవి. ఐదు జ్ఞానేంద్రియముల జ్ఞానము వలన వచ్చు పాపపుణ్యములను దైవజ్ఞానము

అను అగ్నిచేత కాల్చి వేయడమును జ్ఞానయజ్ఞము అంటున్నాము. కడుపులో జరుగు ద్రవ్యయజ్ఞమునకు రుత్వికుడు ఆత్మకాగా, తలలో జరుగు జ్ఞాన యజ్ఞమునకు రుత్వికుడు జీవుడు. అయితే ఏ మనిషిలోకానీ జ్ఞానయజ్ఞము జరుగవలసిన చోట దైవజ్ఞానమను అగ్నిలేదు. అగ్నిగుండమైన గుణ చక్రములో జ్ఞానాగ్ని లేదు. అగ్నిని సంపాదించుకోవలసిన జీవుడు జ్ఞానాగ్ని గురించి ఏమాత్రము యోచించలేదు, ప్రయత్నించలేదు. జ్ఞానయజ్ఞమును చేయవలసిన రుత్వికుడైన జీవుడు కర్మలను కట్టెలను జమ చేసుకొంటున్నాడు గానీ, వాటిని గుండములోవేసి జ్ఞానాగ్నితో కాల్చవలెనని అనుకోవడము లేదు. అందువలన ఏ శరీరములో గానీ జ్ఞానయజ్ఞము జరుగడము లేదు.

శరీరము బయటతప్ప శరీరము లోపల ధ్యాసలేని మనిషి శరీరము లోని యజ్ఞములను గురించి ఆలోచించలేదు. ప్రతి మనిషి పుట్టింది మొదలు చిన్నతనమునుండి బ్రతికేదానికి కావలసిన చదువును నేర్చుకొనుచున్నాడు. ఇలా జీవిత ప్రారంభములోనే చదువుకొనుట ఉద్యోగముకొరకనీ, ఉద్యోగము బ్రతకడానికనీ, బ్రతుకు భార్యాపిల్లలకొరకనీ, పిల్లలు తన పేరు చెప్పేదాని కనీ, మనిషి అనుకొంటున్నాడు. అలా అనుకోవడము వలన జీవితమంతా పని చేయడమే జరుగుచున్నది. చదువు పూర్తి అగుటకు దాదాపు 25 సంవత్సరములు పట్టగా, చదువు అయిపోతూనే ఉద్యోగము కొరకు వెదకడము, ఉద్యోగమొస్తూనే ఉన్నత హెూదా కొరకు (ప్రమోషన్ కొరకు) ప్రాకులాడడము, ప్రమోషన్ వచ్చిన తర్వాత కొడుకులకు, భార్యకు ఆస్తిని సంపాదించడములో నిమగ్నముకావడమూ, ఉద్యోగము అయిపోయిన తర్వాత కొడుకుల జీవితము కొరకు ఆలోచించి వారిని ఉన్నత స్థితిలో చూడాలనుకోవడమూ, వారు ఉన్నత స్థితికి పోయిన తర్వాత అప్పుడు కూడా కొడుకు పిల్లలకు ఆస్తిని చేకూర్చవలెనని ప్రాకులాడుచూ ఒక దినము

చనిపోవడము జరుగుచున్నది. ఈ విధముగా ప్రతి మనిషి పుట్టింది మొదలుకొని చనిపోయేంతవరకు, తీరిక లేకుండా ఏదో ఒక దానికొరకు ప్రాకులాడుచు బ్రతుకుచున్నాడు. మనిషి తన జీవితమును సాగించుటకు ఒక ఉపాధిని వెదకుకోవడము, దానియందే జీవిత కాలమంతయు గడిపి వేయడము జరుగుచున్నది. కొందరైతే బ్రతికే దానికి నిత్యము పనులను వెదకుకొని వాటిని చేసి, వాటివలన వచ్చిన ఆదాయముతో జీవితబండిని బరువుగా లాగువారు కూడా కలరు. ఇట్లు ఎందరో సుఖముగా బ్రతుకుట కొరకు తీరిక లేకుండా ఉన్నారు. అట్లే కొందరు కష్టముగా బ్రతుకుటకు కూడా తీరికలేక తమ దృష్ఠినంతటిని బ్రతుకుతెరువు కొరకు ప్రపంచ విషయములలో లగ్నము చేయుచున్నారు.

ఈ విధముగా ఏమాత్రము తీరికలేని మనిషి తన మనో దృష్ఠి నంతటిని బయట ప్రపంచములో లగ్నము చేసియున్నాడు. అటువంట పుడు మనిషి యజ్ఞమును గురించిగానీ, ద్రవ్యయజ్ఞమును గురించిగానీ, జ్ఞానయజ్ఞమును గురించిగానీ ఆలోచించే స్థితిలో లేడు. ద్రవ్యయజ్ఞ, జ్ఞాన యజ్ఞముల విషయమే తెలియనపుడు వాటికొరకు ఎవడూ ప్రయత్నము చేయడు. ఎవడైనా యజ్ఞమును గురించి దేవుడిలా చెప్పాడని చెప్పితే దానిని వినినా, తన ఆశయమంతా సంపాదనకొరకే ఉండుట వలన యజ్ఞ విషయము మనిషి బుర్రకు ఎక్కడము లేదు. కొందరు తెలివైనవారు రుత్వికులు మనిషి ఆశ అను గుణముతో తగులుకొని ఉండుట వలన, వాని దృష్ఠికి కోర్కెలు తప్ప ఏమీ కనిపించవని తెలిసినవారై, యజ్ఞములు కోర్కెలు తీరుటకు తయారు చేయబడినాయనీ, వాటిని మేము చేస్తాము మీరు చేయించండనీ చెప్పడము వలన, మనిషి తన కోర్కెల నిమిత్తము

యజ్ఞములను చేయిస్తున్నాడు. యజ్ఞమువలన తమ కోర్కెలు నెరవేరునని తెలిసి ఆర్థిక స్థోమతయున్నవారు యజ్ఞములను చేయించు కార్యములో ఎందరో ఉండగా, యజ్ఞములను గురించి చెప్పి చేయించడమే కార్యముగా పెట్టుకొన్నవారు కొందరు గలరు. ఈ విధముగా త్రేతాయుగమునుండి బాహ్యయజ్ఞములు చేయుట మనుషులకు అలవాటైనది. ఆ కాలములో రాజులు ఏదో ఒక కాంక్షతో మహర్షులను పిలచి వారిచేత యజ్ఞములు చేయించేవారు. కొందరు మహర్షులు రాజుల వద్దకు వచ్చి ఫలానా యజ్ఞము చేయుదుము. దానివలన మీకు మీ రాజ్యమునకు ఫలానా మంచి జరుగునని చెప్పి, దానికి కావలసిన ధనమును ఇప్పించుకొని పోయి, వారున్నచోటనే యజ్ఞములను చేసెడివారు. ఈ విధముగా మొదలైన బాహ్యయజ్ఞములు వాటిని చేసేవారికి వృత్తిగా, చేయించే వారికి ఆరాధనగా మారిపోయాయి.

**ఆశలు లేకుండా చేయవలసిన దేవుని ఆరాధనలు సహితము చివరకు ఆశలతో కూడుకొన్న ఆరాధనలుగా మారిపోయాయి.** ఈ పనిచేస్తే నాకు ఏమి లాభము వస్తుందని ఆలోచించే మనిషి, ఈ ఆరాధన చేస్తే నాకు ఏమి వస్తుందనీ, ఈ యజ్ఞము చేస్తే ఏమి కలుగుతుందనీ, లాభము కొరకు చూస్తున్నాడు. అందువలన కంసాలి అమ్మవలసిన దండ (హారము) చివరకు దండముగా మారిపోయినట్లు, దేవుడు చెప్పిన కర్మనాశనము చేయు జ్ఞాన యజ్ఞము, చివరకు కర్మలను సృష్టించు బాహ్యయజ్ఞముగా మారిపోయినది. కర్మలను జ్ఞానయజ్ఞము నాశనము చేయు (జీర్ణము చేయు) నని తెలుపుటకు ద్రవ్యములను నాశనము చేయుటే (జీర్ణము చేయుటే) ఆశయముగా గల జీర్ణాశయమును దేవుడు నమూనాగా శరీరములో ఉంచి, ఇది ద్రవ్య యజ్ఞమనీ, దీనికంటే శ్రేష్ఠమైనది కర్మలను జీర్ణము చేయు జ్ఞానయజ్ఞమనీ భగవద్గీతలో తెలుపగా, భగవద్గీతను బోధించు

బోధకులకు ద్రవ్యయజ్ఞమును గురించిగానీ, దానికంటే శ్రేష్ఠమైన జ్ఞానయజ్ఞమును గురించిగానీ ఏమాత్రము అర్థము కాలేదు. దేవుడు చెప్పిన యజ్ఞములు తమ దృష్టికి కనిపించక పోవడమేకాక, వాటిస్థానములో కర్మలను సంపాదించు, కోర్కెలు నెరవేర్చు బాహ్య యజ్ఞములు పెద్దగా కనిపించాయి. తమ చూపుకు బాహ్యయజ్ఞములు తప్ప శరీరములోని అంతర్గత యజ్ఞములు కనిపించకపోవడము వలన, ద్రవ్యయజ్ఞము తెలియలేదు. దాని నమూనా అయిన జ్ఞానయజ్ఞము తెలియ లేదు.

బాహ్యయజ్ఞములను ఏదో ఒక కోర్కెతోనే చేయుచుందురు. సమాజమునకు సంబంధించిన లాభము కొరకుగానీ, దేశమునకు సంబంధించిన లాభము కొరకుగానీ, లేక తనకూ తన కుటుంభమునకూ సంబంధించిన లాభము కొరకుగానీ బాహ్యయజ్ఞములను చేయుచున్నారు. ఏదో ఒక కోర్కె నిమిత్తము యజ్ఞములు చేయగా, ఆ కోర్కెలు నెరవేరినట్లుగా తెలుసుకొన్నాము. యజ్ఞములు చేస్తే రాముడు పుట్టాడను త్రేతాయుగ కాలము నుండి నేటి వరకు యజ్ఞముల వలన కోర్కెలు నెరవేరునని విను చున్నాము. ఈ మధ్యకాలములో వర్షము కొరకు ప్రభుత్వము వారే వరుణ యజ్ఞమును చేయించగా అనేకమంది ఋత్వికులు చేశారు. అప్పుడప్పుడు తిరుపతి దేవస్థానము వారు కూడా ఏదో ఒక పేరు పెట్టి, ఏదో ఒక యజ్ఞము చేయుట చూస్తున్నాము. అట్లే అనేక దేవస్థానములలో చిన్నస్థాయి యజ్ఞమునుండి పెద్దస్థాయి యాగము వరకు చేయుచుండుట చూస్తున్నాము. వీరందరూ ఏదో ఒక మంచి జరగాలను సంకల్పముతో యజ్ఞములను చేయగా, కొన్నిటికి కొన్ని నెరవేరుచున్నవి. లాభమును కోరి చేయు ప్రతి యజ్ఞము ఫలితమును ఇవ్వక పోయినా, కొన్ని యజ్ఞములు మాత్రము కోర్కెలను నెరవేర్చుచున్నవి. పూర్తి కర్మకు విరుద్ధమైన చోట మాత్రము

యజ్ఞము చేసినా ఫలితము లేకుండా పోవుచున్నది. ఒక విధముగా చెప్పితే నూటికి తొంభై యజ్ఞములందు కోర్కెలు నెరవేరుచున్నవని చెప్పవచ్చును. యజ్ఞములు చేస్తే కోర్కెలు నెరవేరునా, వరుణ యజ్ఞము చేస్తే వర్షము వస్తుందా అని హేతువాదులు, నాస్తికవాదులు ప్రశ్నించవచ్చును. నాస్తిక వాదుల ప్రశ్నకు నేను జవాబు చెప్పను. కానీ హేతువాదులు అడుగు ప్రశ్నకు తప్పనిసరిగా జవాబు ఇస్తాను. నాస్తికవాదులు శాస్త్రబద్ధతను వదలి మాట్లాడుదురు. కావున వారి ప్రశ్నకు జవాబు ఇవ్వము. హేతువాదులు శాస్త్రబద్ధతను కలిగి, శాస్త్రబద్ధమైన జవాబును ఒప్పుకుంటారు. అందువలన హేతుబద్ధమైన ఏ ప్రశ్నకైనా జవాబును ఇవ్వగలము.

మేము జ్ఞానయజ్ఞము కానటువంటి బాహ్యయజ్ఞములను అధర్మము లని చెప్పుచున్నా, వాటియందు ఏమి జరుగుచున్నదో, వాటివలన మనిషి ఏమి పొందుచున్నాడో, ఎలా పొందుచున్నాడో తెలుసు కాబట్టి దానిని గురించిన జవాబును చెప్పగలను. ప్రతి బాహ్య యజ్ఞము వెనుక కనిపించని భూతముగానీ, గ్రహముగానీ ఉండును. భూతము, గ్రహము అంటే పూనకము వచ్చే దయ్యము అనుకోవద్దండి. భూతముగానీ, గ్రహము గానీ ఖగోళములోనున్న శక్తులని జ్ఞప్తికుంచుకోవలెను. బాహ్యయజ్ఞము వెనుక కనిపించకయున్న శక్తి గ్రహముగానీ లేక భూతముగానీ అయి ఉంటుంది. అదియే ఆ యజ్ఞమునకు అధిపతిగా ఉండును. యజ్ఞము చేసే రుత్వికుడు ఆ యజ్ఞమునకు ఏదో ఒక దేవతను పెద్దగా పెట్టుకొని, ఆ దేవతకు సంబంధించిన మంత్రములే చదివి, యజ్ఞములో వేయు ప్రతి వస్తువు ఆ దేవతకే చేరాలని సమర్పించినా వారికి తెలియకుండా, వారికంటికి కనిపించకుండా అంతయు వేరుగా జరుగుచుండును. వారు అనుకొన్న దేవత అక్కడుండదు. అక్కడ ఖగోళమునుండి వచ్చిన గ్రహశక్తియో లేక

భూత శక్తియో ఏదో ఒకటి ఉండి, వారు అగ్నిగుండములో వేయు ప్రతి వస్తువులోని సూక్ష్మమును గ్రహించుచుండును. ఒక పట్టు వస్త్రమును యజ్ఞములోనికి వేసినపుడు అది కాలిపోవడము మనకంటికి కనిపించినా వస్త్రములోని అర్థము మాత్రము సూక్ష్మవస్త్రముగా గ్రహశక్తికి చేరును. ఇక్కడ ఒక విషయమును అందరూ గ్రహించవలెను, అదేమనగా!

ప్రపంచములో జీవమున్న, జీవములేని ఏ పదార్థమునకైనగానీ, స్థూల సూక్ష్మముల రూపములుండును. నెయ్యి ఒక ద్రవపదార్థము కదా! ఆ పదార్థములో ఆత్మ, జీవాత్మ లేకున్నా పరమాత్మ మాత్రముండును. జీవమున్న దానిలో మూడు ఆత్మలున్నట్లు ముందే చెప్పుకొన్నాము. జీవము లేనిదానిలో పరమాత్మ ఉంటుంది. పరమాత్మ అణువణువునా వ్యాపించి వున్నది. కావున దేనియందైనా పరమాత్మ గలదు. అందువలన దేనినైనా ఒక పదార్థముగా చెప్పుకొంటున్నాము. పదార్థమును విడదీసి చూస్తే పద + అర్థము = పదార్థము అగుచున్నది కదా! పదము అంటే పేరు గల్గినది ఏదైనా కావచ్చును. అర్థము అంటే ధనము లేక సారాంశము అని తెలుసు. ఒక వస్తువులోని సారాంశము అందులోని పరమాత్మయేనని తెలియవలెను. కంటికి కనిపించు జీవములేని పదార్థములో కూడా స్థూల, సూక్ష్మ రూపములున్నవి. ఇప్పుడు ఒక బాహ్య యజ్ఞములో ద్రవపదార్థమైన నెయ్యిని అగ్నిగుండములో వేసినపుడు, స్థూలముగా కనిపించు నెయ్యి అగ్నిలో కాలిపోవుచున్నది. అప్పుడు నెయ్యి యొక్క స్థూలరూపము కాలిపోయినా, దాని సూక్ష్మరూపము మాత్రము మిగిలి ఉన్నది. నెయ్యి కాలిపోయినపుడు దాని సూక్ష్మరూపము వాయువుగా మారి గాలిలో కలిసి సూక్ష్మమైపోయి, అక్కడే యజ్ఞమునకు అధిపతిగాయున్న శక్తికి చేరుచున్నది. యజ్ఞములో కాల్చు ప్రతి వస్తువు అక్కడేనున్న గ్రహశక్తికి చేరుచున్నది. యజ్ఞములో

ఎన్ని మంచి వస్తువులు వేస్తే అంత మంచి ఫలితము తొందరగా వస్తుందనీ, యజ్ఞములో వేయు వస్తువులు తాము ఉచ్ఛాటన చేసిన దేవతకు చేరుచున్న వనీ, యజ్ఞములను చేయువారు అనుకొనుచుందురు. రుత్వికులు వర్షము కొరకు యజ్ఞము చేయునప్పుడు, వరుణ దేవుని ఆవాహన మంత్రములను చదివి, వరుణునికి సంబంధించిన వేద మంత్రములను పఠించి, తాము యజ్ఞగుండములో వేయు వస్తువులన్నీ వరుణుడు స్వీకరించి, వర్షమును కురిపించవలెనని మంత్రరూపమున చెప్పి వరుణ యజ్ఞమును చేయగా, యజ్ఞ సమిధలుగా అగ్నిలో కాల్చిన వస్తువులన్నిటిని లేక పదార్థములన్నిటిని స్వీకరించుటకు అక్కడ వరుణ దేవుడు ఉండడు. ఆ యజ్ఞమునకు అధిపతిగానున్న గ్రహశక్తియే, యజ్ఞములో కాలిపోయి సూక్ష్మరూపమైన పదార్థములను తీసుకొనును. అలా తీసుకొన్న గ్రహమే ముందే దేవుడు చెప్పిన ఆజ్ఞ ప్రకారము యజ్ఞము చేసిన వారి కోర్కెను బట్టి వర్షమును కురిపించవచ్చును, లేక కురిపించకపోవచ్చును. ఇదే విధముగా అన్ని రకముల యజ్ఞములందు జరుగుచున్నది.

మనుషులు కోరు ప్రతి కోరిక దేవునికి ఆమోదయోగ్యముకాదు. మనుషులు కూడా ఒప్పుకోనటువంటి కోర్కెలను కొందరు కోరుచుందురు. ఇతరుల ఆస్తిని అక్రమముగా దోచుకోవాలను కోరిక, దేవునికి అమోద యోగ్యము కాదు. అలాగే ఇతరుని భార్య వానిని వదలి తనవద్దకు రావలెనను కోరిక, మనుషులకు కూడా ఆమోదమైనది కాదు. ఇటువంటి కోర్కెలను గ్రహశక్తులు నెరవేర్చవు. ఇవే కాకుండా గ్రహశక్తికి ఆమోద యోగ్యముకాని కోర్కెలతో యజ్ఞము చేస్తే అవి నెరవేరవు. అంతేకాక ఇంకా కొన్ని మనుషుల కోర్కెలు గ్రహశక్తులకు కూడా కోపమును కల్గించును. అటువంటపుడు యజ్ఞములు నెరవేరకపోవడమేకాక, అటువంటి యజ్ఞముల వలన చేయించిన

వారికే ముప్పువచ్చును. చేసినవారికి కూడా తిప్పలు తప్పవు. ఋత్వికులైన బ్రాహ్మణులు అనుకొన్నట్లు యజ్ఞములకు అధి దేవతలు ఎవరూ లేరు. అందువలన యజ్ఞములకు, దేవతలకు ఏమాత్రము సంబంధములేదు. బాహ్యయజ్ఞములను అనేక పేర్లతో, అనేక ఆశలతో చేయుట వలన వాటికి అధిపతులైన సూక్ష్మశక్తులు మంచి ఉద్దేశ్యముతో చేయువారికి మంచినీ, చెడు ఉద్దేశ్యముతో చేయువారికి చెడు ఫలితమునూ కల్గించుచున్నవి.

దేవతల ఆరాధన నిమిత్తము చేయు ఏ కార్యమునైనా గ్రహశక్తులు సమర్థించవు. దేవున్ని వదలి దేవతలను ఆరాధించడము ఆ శక్తులకు సరిపోదు. దేవుని జ్ఞానమును పూర్తిగా తెలిసియున్నవి గ్రహశక్తులు, భూత శక్తులు. గ్రహములు, భూతములు దేవుని పాలనలోనివారైయుందురు. అందువలన గ్రహములు, భూతములు మనుషులు పూజించు దేవతలకంటే గొప్పవారుగా ఉన్నారు. కొన్ని ఆరాధనలు దేవతలకు సంబంధించినవైనా, అలాగే కొన్ని యజ్ఞములు దేవతలకు సంబంధించినవైనా, వాటిని ఆరాధించిన వారికి కొన్నిచోట్ల తామే ఫలితమును ఇచ్చినా, కొన్ని ఆరాధనలనూ, మరికొన్ని యజ్ఞములను పూర్తి వ్యతిరేఖించినవారై వాటిని చేసిన వారిమీద కోపము కల్గి తీవ్రమైన నష్టమును, కష్టమును కల్గించుదురు. దీనినిబట్టి యజ్ఞముల వలన, ఆరాధనల వలన లాభమేకాదు, నష్టము కూడా కలదని తెలియుచున్నది. త్రేతాయుగములో రావణబ్రహ్మ కాలమున ఎందరో భక్తులమనుకొనువారు, జ్ఞానులమనుకొనువారు కొన్ని కోర్కెల నిమిత్తము యజ్ఞములు చేసినప్పుడు, వాటిని రావణబ్రహ్మ అనుచరులు వచ్చి భంగము చేయగా, ఆ యజ్ఞములకధిపతులుగాయున్న గ్రహశక్తులు రావణబ్రహ్మ అనుచరులను ఏమాత్రము అడ్డుకోక, వారికే తమ మద్దతు తెలిపారు. ఆ కాలములోనే రావణబ్రహ్మ యజ్ఞములు చేయుట అధర్మమని,

తమ దేశములోనేకాక ప్రక్క దేశమైన భారతదేశములో కూడా ప్రచారము చేశాడు. వారి ప్రచారమునకు అడ్డువచ్చిన వారిని శిక్షించడము కూడా జరిగినది. ఆనాడు ఖగోళశక్తులన్నీ రావణునికి తమ మద్దతు తెలిపెడివి. అప్పటి కాలములో భారత దేశములో దక్షిణ భాగమునందు రావణబ్రహ్మ ప్రభావము ఎక్కువగా ఉండడము, యజ్ఞములు చేయువారిని అడ్డుకోవడము, యజ్ఞములు అధర్మములని చెప్పడము ఉత్తర భారతదేశమందున్న వారికి నచ్చలేదు.

ఉత్తర భారతదేశమున ఆర్యులదే ఎక్కువ పెత్తనముండెడిది. ఆర్యులు రాజులను సహితము వారి చెప్పుచేతలలో పెట్టుకొని వారు ఆడింది ఆట, పాడింది పాటలాగ వారు చేసిందే పూజ, చేయించిందే యజ్ఞము అనుచుండిరి. అధర్మకార్యమని యజ్ఞములను రావణబ్రహ్మ వ్యతిరేఖించిన దానివలన, రావణుడు ఆర్యులకు గర్భశత్రువుగా మారిపోయాడు. ఆనాడు శ్రీలంక కూడా భారతదేశములోని భూభాగమే అయినందున, లంక రాజ్యము దక్షిణ భారతదేశములో కొంతవరకు విస్తరించి ఉండెడిది. అందువలన ఉత్తర భారతదేశములోని ఆర్యులు దక్షిణ భారతదేశమును ద్రావిడ దేశమని అనెడివారు. ద్రావిడదేశము అజ్ఞానదేశమని ఆర్యులు అనగా, ఉత్తర దేశములోని ఆర్యులు అజ్ఞానులని ద్రావిడులు అనెడివారు. రావణబ్రహ్మ కాలము పోయిన తర్వాత శ్రీలంక భూభాగము తుఫానుల వలన నీరు చేరి, భారతదేశము నుండి విడివడినట్లు వేరైపోయిన తర్వాత, దక్షిణ దేశమైన ద్రావిడ దేశములోనికి ఆర్యులు వచ్చి తమ ప్రాబల్యమును పెంచుకోవాలనుకొన్నారు. అప్పటికే దక్షిణ భారతదేశములోని బ్రాహ్మణు లందరు బ్రహ్మజ్ఞానములో మంచి ప్రావీణ్యత సంపాదించినవారై ఉండెడి వారు. దక్షిణ దేశములోని బ్రాహ్మణులు చెప్పింది చెప్పినట్లు జరిగెడి వాక్

శుద్ధి కల్గినవారై, జ్ఞానశక్తికలవారై ఉండెడివారు. లంకరాజ్యమునకు రాజయిన రావణబ్రహ్మ బ్రాహ్మణుడు అయిన దానివలన ఆయన వంశమువారు, వారి బంధువులు మొదలగు బ్రాహ్మణులందరు గొప్ప శక్తికల్గినవారై ఉండగా, ఉత్తరదేశములోని బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానము లేనివారై పేరుకు బ్రాహ్మణులై ఉండిరి. అప్పటికాలములో వారికి బ్రాహ్మణులు అను పేరులేదు. ఆర్యులు అని మాత్రమే పిలువబడుచుండెడి వారు. దక్షిణ దేశములోనివారే బ్రాహ్మణ అని పేరు కల్గియుండిరి. త్రేతాయుగము తర్వాత ద్వాపరయుగము మొదటిలో దక్షిణ దేశములోనికి రావాలనుకొన్న ఆర్యులు ఒక్కొక్కరుగా వచ్చారు. అలా వచ్చిన ఆర్యులు ఇక్కడి బ్రాహ్మణులతో సంబంధ బాంధవ్యములు పెట్టుకొన్నారు. ద్వాపర యుగము మొదలులో ఆర్యులు దక్షిణ దేశములోనికి వచ్చిన తర్వాత దాదాపు ఎనిమిది లక్షల సంవత్సరములకు, మాయా ప్రభావము వలన దక్షిణ దేశములో కూడా ఆర్యుల ప్రభావము ప్రాకిపోయి, ద్రావిడ బ్రాహ్మణులు కూడా అధర్మ ఆచరణలో మునిగిపోయి, యజ్ఞములను చేయుటకు అలవాటైపోయారు. దక్షిణదేశములోని బ్రాహ్మణులు ఆర్య బ్రాహ్మణుల మాటలు విని, తమ వంశమువాడైన రావణున్ని రాక్షసుడని అన్నారు. ద్వాపర యుగము ఇంకా దాదాపు డెబ్బయి వేల సంవత్సరము లున్నట్లే, ఆర్యులు తమ బలమును దక్షిణ దేశమున పెంచుకొనుటకు రావణ బ్రహ్మకు శత్రువైన రాముని గుడిని కట్టారు. కేవలము ప్రాంతీయ ద్వేషముతో రావణబ్రహ్మ బ్రాహ్మణుడైనా, క్షత్రియుడైన రామున్ని పెద్దగా చేసి రావణ బ్రహ్మను తక్కువ చేసారు. ప్రతి ఊరులోను రాముని గుడి ఉండునట్లు ప్రజలకు బోధించారు. ఆ విధముగా ద్వాపరయుగములో ప్రతి ఊరులోను రాముని గుడి తయారైనది. రాముని గుడి కట్టిన చోటంతా రాముని ప్రతిమను ప్రతిష్ఠించు

సమయములో యజ్ఞమును చేయడము విధిగా పెట్టారు. శ్రీరాముడు యజ్ఞ రక్షకుడైనందున శ్రీరామ దేవాలయమువద్ద తప్పనిసరిగా యజ్ఞము చేయాలని నిర్ణయించారు.

ఆర్య బ్రాహ్మణులు ద్రావిడ బ్రాహ్మణులను పూర్తిగా మార్చివేయడము వలన, ద్వాపరయుగము చివరికి అధర్మములైన యజ్ఞములకు ఎక్కువ పట్టు వచ్చినది. బ్రహ్మాజ్ఞానము అడుగంటిపోయి, ధర్మములు నశించి చివరి దశకు వచ్చాయి. ధర్మములకు ముప్పు ఏర్పడి అధర్మములు చెలరేగి పోయాయని గ్రహించిన దేవుడు తిరిగి ధర్మములను నెలకొల్పవలసిన అవసరము వచ్చినది. అప్పుడు శ్రీకృష్ణుని అవతారముగా భగవంతుడు భూమిమీదకు వచ్చాడు. అధర్మములకు పుట్టినిల్లయిన ఉత్తర భారత దేశములోనే భగవంతుడు పుట్టాడు. అధర్మములకు బంధువులైన ఆర్యులకు తెలియునట్లు అక్కడే సమయము చూచి భగవద్గీత రూపములో ధర్మములను బోధించాడు. తర్వాత వేదవ్యాసుని ద్వారా భగవద్గీత, శ్లోకముల రూపములో సంస్కృత భాషలో బయటికి వచ్చినది. అప్పటి ఆర్యుల భాష సంస్కృత భాష. సంస్కృత భాష లిపిలేని భాష. ఆర్యులు మాత్రము సంస్కృతమును ఎవరికీ అర్థముకానట్లు మాట్లాడెడివారు. ఈ ప్రాంతములో ఎరికల భాషలాంటిది సంస్కృత భాష. ఎరికల తెగవారికి మాత్రము వారి భాష తెలుసు. కావున వారి మాటలు ఎవరికీ అర్థము కాకుండటకు, వారి భాషను వారే మాట్లాడుకొనుచుందురు. అలాగే ఆర్య తెగవారికి మాత్రము సంస్కృత భాష తెలుసు. అందువలన వారిదేదో గొప్ప భాష అన్నట్లు, దానిని దేవ భాషయని ప్రచారము చేశారు. ఇదంతయూ ఆనాటి ఆర్యుల తెలివి. వేదవ్యాసుడు కూడా ఆర్యుడే అయినందున హిందీలిపిని ఉప యోగించి సంస్కృత భాషలో భగవద్గీతను వ్రాశాడు. సంస్కృతము ఆర్యులకు

తప్ప ఎవరికీ తెలియదు, కావున గీత వివరము కొరకు ఆ భాష తెలిసిన వారిమీదనే ఆధారపడవలెనని ఆనాటి వారి ఉద్దేశ్యము. ఎవరికీ అర్థము కాకుండటకు ఆర్యులు ఏది వ్రాసినా తమ భాషలోనే వ్రాసేవారు. అలా వారు వ్రాసిన దానిని తెలియాలంటే ఎవరైనా వారివద్దకే పోవాలి. అప్పటి కాలములో ఆర్యులు హిందీ భాషలో పండితులైవుండి, హిందీ భాషను వ్రాయక సంస్కృత భాషను వ్రాయడము, దానినే దేవభాష అని చెప్పడము చూస్తే, ఆర్యులు బహు తెలివైనవారని అర్థమగుచున్నది కదా!

ఆర్యులు తెలివైనవారు కాబట్టే ద్రావిడ దేశములోనికి వచ్చి ద్రావిడ బ్రాహ్మణులను మార్చివేశారు. తాము ద్రావిడులమను ధ్యాస కూడా లేకుండా చేసి, తమ వంశమువాడైన రావణున్ని తామే దూషించునట్లు చేశారు. రావణుడు వేరు, తాము వేరు అన్నట్లు చేశారు. రావణుడు వ్యతిరేఖించిన యజ్ఞములను ద్రావిడ బ్రాహ్మణుల చేతనే చేయించారు, చేయిస్తున్నారు. ఆర్య సమాజమను పేరుతో యజ్ఞములు చేయుటే విధిగా పెట్టారు. నేడు దక్షిణ భారత బ్రాహ్మణులేకాక, ఇతర కులములవారు కూడా మాది ఆర్య సమాజమని చెప్పుకోవడము విచిత్రముగా కనిపిస్తున్నది. భారతదేశము యొక్క సంస్కృతి అంతయు ఆర్యుల చేతివ్రాతయిన సంస్కృత భాషలో చిక్కుకొనిపోయినది. చివరకు భగవద్గీత కూడా సంస్కృత భాషలో చిక్కుకొని పోవడమేకాక, ఈ దినము సంస్కృతము తెలిసినవాడే స్వామి, గురువు అను భావము ఉన్నది. భావమును తెల్పునది భాష. ఇటు దేశ భాషలలో దక్షిణ దేశ భాష అయిన తెలుగు గొప్పదికాగా, పైగా లిపియున్న పెద్ద భాష తెలుగుకాగా, ఎరికల భాషలాంటి లిపిలేని భాష అయిన సంస్కృతమును గొప్పగా చెప్పుకోవలసిన అవసరమేమి వచ్చినదని నేను ప్రశ్నించుచున్నాను. నా మాటలు బాకులవలె కొందరికి పొడుచుకోవచ్చును. అయినా మీ

హృదయము మీద చేయిపెట్టి, నేను సత్యమును చెప్పుచున్నానో లేదో మీరే చెప్పండి. అసూయవద్దు, ఆలోచన కావాలని చెప్పుచున్నాను.

ద్రావిడ దేశములో పుట్టిన మనకు రావణుడు బ్రాహ్మణుడను విషయము కూడా తెలియకుండాపోయినది. అంతేకాకుండా ఆయన బ్రహ్మజ్ఞానియనీ, త్రికాల జ్ఞానియనీ కూడా ఎవరికీ తెలియదు. అందరికీ తెలిసినది రావణుడు రాక్షసుడు. సీతను తీసుకుపోయిన కామాంధుడు. అయితే పదినెలలు కాలము రావణబ్రహ్మ దగ్గర లంకలోనున్న సీత, రావణుడు దుర్మార్గుడని ఒక్కమారు కూడా అనలేదు. పది నెలల కాలము సీతను కన్న తండ్రివలె చూచుకొన్న రావణుడు, ఆర్యుల వ్రాతలో చెడ్డవాడై పోయాడు. ఒక్క యజ్ఞములను అధర్మములని వ్యతిరేఖించినందుకు పనిగట్టుకొని రావణుడు చెడ్డవాడని ఆర్యులు ప్రచారము చేశారు. ద్వాపర యుగము చివరిలో ధర్మములకు ముప్పు ఏర్పడినదని తెలిసిన తర్వాత కృష్ణుడు పుట్టి భగవద్గీతను చెప్పగా, దానిని ఎవరికీ అర్థము కాకుండా చేశారు. దేవుడు భగవద్గీతలో ధర్మములను తెలిపిపోగా, చివరికి దానిలో ధర్మములున్నవో, అధర్మములున్నవో అర్థము కాకుండా పోవునట్లు చేశారు. దేవుడు చెప్పిన భావములకు వ్యతిరేఖ భావములున్న సంస్కృత శ్లోకములను గీతలో చొప్పించారు. దేవుని జ్ఞానమునే అర్థము కాకుండా చేసి, మనుషులందరినీ శూద్రులని, తాము శుభ్రముగలవారమని చెప్పడము వలన, తీర్థ ప్రసాదములను కూడా దూరమునుండి ఇవ్వడము వలన, ఇంతకాలము ఎంతో ఓపికగానున్న శూద్రులందరూ బేధ భావములేని, అంటరానితనము లేని క్రైస్తవములోనికి పోజొచ్చారు. దానితో హిందూ మతము నేడు పూర్తిగా క్షీణించు ప్రమాదములోనికి పోయినది. తెలివైన ఆర్యులు హిందూమతము క్షీణించుచున్నదనీ, మనుషులు లేని మతము

మీద తమ బలముండదనీ ఆలోచించి, బహుతెలివిగా తాము వెనుకవుండి, శూద్రుల చేతనే హిందూమత రక్షణ సంఘములను స్థాపించి, తమకు వ్యతిరేఖ బోధలు చేయు మాలాంటి వారి మీద కూడా వీరు పరమతమును బోధిస్తున్నారని హిందూ శూద్రులనే రెచ్చగొట్టి, హిందూ ధర్మసిద్ధాంతకర్తలైన మామీదికే యుద్ధానికి పంపుచున్నారు. వెనుకటి చరిత్ర తెలియని హిందూ రక్షకులన్న హిందువులు మేము మతమును రక్షించుచున్నామనుకొంటున్నారు తప్ప, మన వెనక పెద్ద కుట్ర దాగివుందనీ, హిందూ మతము క్షీణించుటకు అసలు కారకులు ఫలానావారని తెలియలేక హిందూమతమును చేజేతులారా క్షీణింపజేసుకొంటున్నారు.

ఇప్పటికైనా హిందూమతము బాగుపడాలంటే హిందూమతములో సమానత్వము రావాలి. సమానత్వము రావాలంటే దేవుడు చెప్పిన భగవద్గీతను చదవాలి. భగవద్గీతను చదవాలంటే ముందు బ్రాహ్మణులు దానిని సక్రమముగా బోధించాలి. బ్రాహ్మణులు సక్రమముగా బోధించాలంటే ముందు తాము ద్రావిడ బ్రాహ్మణులమని తెలుసుకోవాలి. తాము ద్రావిడ బ్రాహ్మణులమని తెలియాలంటే ముందు ఆర్యులెవరో తెలియాలి. ఈ విధముగా ఆర్యులనుండి నేటి సమాజము వరకు ఎలా మారిపోయామో తెలియాలి. ఆర్యుల అధర్మములను తగ్గించుటకు, ఆర్యుల దేశములోనే భగవద్గీత బోధింపబడినదని తెలిసి, ధర్మ ప్రతిష్ఠాపన జరిగిన గీతను చదవాలి. గీతలో దేవుడు చెప్పిన భావములను తెలియగలిగితే, అప్పుడు మనము అందరమూ ధర్మములను గుర్తించగలము. ఎప్పుడైతే ధర్మములను గుర్తించగలిగి వాటిని అనుసరించగలిగామో, అప్పుడు మనిషికి శాంతి దొరుకుతుంది. ధర్మములు తెలియనంతవరకు ఏ మనిషికీ శాంతి ఉండదు. ధర్మము తెలియనంతవరకు మనిషి ఆశల వలలో చిక్కి, ఏ యజ్ఞము చేస్తే

ఏ లాభము వచ్చునో అని చూస్తుండును. అంతేకాక ధర్మములకు నిలయమైన హిందూమతమును వీడి, ఇతర మతములోనికి పోతే మంచి జరుగుతుందే మోననీ, మనము చేసుకొన్న పాపము పోతుందేమో అనుకొని, మతములు మారితే దేవునికి దూరముగా పోవడము తప్ప ఏమీ జరుగదు.

ఇప్పటికైనా ఇందూ (హిందూ) దేశమైన భారత దేశములో పుట్టినందుకు గర్విద్దాము. భారతదేశము ప్రపంచ దేశములలోనే జ్ఞానము గల దేశమని, దైవశక్తిగల దేశమని పేరుగాంచిన దేశము. ఈ దేశమునకు, ఏ దేశమునకూ లేని ఇందూ అను బిరుదుగలదు. ఈ దేశములోనే సృష్ఠి ఆదిలో సూర్యునిచేత ధర్మములు తెలియబడినాయి. తర్వాత ద్వాపర యుగము చివరిలో కూడా ధర్మములివియని, అధర్మములివియని కూడా చెప్పబడినాయి. అంతేకాక దేవుడు భారతదేశమునందు ద్వాపరయుగములో పుట్టి తర్వాత కలియుగములో ఇతర దేశములో పుట్టాడు. ఆయన మూడవ జన్మ ముక్కోణాకారముగా ఏర్పడవలసియున్నది. కావున దేవుడు పుట్టితే ముక్కోణము ఏర్పడుటకు భారతదేశములోనే పుట్టాలి. ఎంతో పెద్ద చరిత్ర, ఎంతో పెద్ద భవిష్యత్తువున్న భారతదేశములో పుట్టిన ప్రతి మనిషి, నేను ఇందువును (జ్ఞానిని) అని గర్వించాలి. దేవుడు పుట్టడు అను మతములోనికి పోయి మనుషులు చెప్పేది వినాలి తప్ప, దేవుడు చెప్పేది వినేదానికి అవకాశము లేదు కదా! అటువంటపుడు దేవుడు పుట్టి తన జ్ఞానమును తానే చెప్పుతానను ఇందూ (హిందూ) మతములో ఉంటే, ఎప్పటికైనా దేవుని మాటలను వినవచ్చును కదా! మా మతములో దేవుడు పుట్టడు అని చెప్పేవారికంటే, దేవుడు పుట్టుతాడని చెప్పే భగవద్గీతను చదివి, ధర్మములను అధర్మములను విడదీసి తెలుసుకొందాము. దానివలన ఎప్పుడైన దేవుడు పుట్టితే దేవున్ని, మనుషలను విడదీసుకొని దేవున్నే

చూడవచ్చును కదా! రేపు దేవున్ని చూచుటకు నేడు ప్రపంచములో ఒకే ఒక యజ్ఞమైన జ్ఞానయజ్ఞమును తెలుసుకొందాము. జ్ఞానయజ్ఞమును తెలిస్తే, ఒక జ్ఞానాగ్నితో ఐదు ప్రపంచ జ్ఞానములను కాల్చివేసి, ఐదు భాగములుగానున్న ప్రకృతిని విడచి, ఒకే ఒక భాగముగాయున్న దేవునిగా మారి పోవచ్చును, ఆలోచించండి.

## సమాప్తం

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

### హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి బలహీనపరచి హిందూ సమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని అన్ని కార్యములు చేసుకోవాలని ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగాయున్న హిందూసమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమని ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డు రాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటి వారు హిందూ సమాజమునకు చీడపురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవ జ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు అజ్ఞాన దిశవైపు నిలిచిపోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, **భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన క్షర, అక్షర, పురుషోత్తమ అను ముగ్గురు పురుషుల విషయమును త్రైత సిద్ధాంతము అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది.** దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోష పడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞానవిషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్తవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలు పెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డు పడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్తవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్తవ మత ప్రచారము చేయు చున్నారని చెప్పడమేకాక, అటువంటి వారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన **హిందూ (ఇందూ) జ్ఞానవేదిక** ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :- ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?**

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలున్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లు తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :- మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?**

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :- క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే**

బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతము వారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతము పేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యములున్నాయా?

**వారి జవాబు :-** త్రైత సిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతి పాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానందయోగీశ్వరులు త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైత సిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికి ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును

**గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించుచూ యుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.**

**వారి జవాబు :–** అవన్ని మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :– మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులము వారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.**

**వారి జవాబు :–** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :– కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా?**

**యోగీశ్వరులవారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండా మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.**

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూమతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :- మేము మతమును గురించి చెప్పలేదు. హిందూమతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికీ ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.**

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :- క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి 'సృష్టికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనేయున్నది. మొదటినుండి హిందూసమాజములో**

**యున్న దేవుడు, సృష్టికర్త అను పేర్లను  హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్టికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?**

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు,  మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకో లేదు.  హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూమతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా!  మీరు హిందువులే అయినప్పుడు  మీ గ్రంథములలోగానీ,  మీ బోధలలోగానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. 'హిందువు', 'ఇందువు' అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి.  తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు  అలాగే వ్రాయుచుందురు.  ప్రస్తుత కాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును  నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని నరసింహ అని వ్రాయవలెను  అని చెప్పుచున్నాము.  అడవిలో మృగరాజును సింహము అని అంటాము తప్ప శింహము అని అనము అనికూడా చెప్పుచున్నాము. సింహము అంటే అర్థమున్నది గానీ, శింహము అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము.  అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే  'ఇందువు' అనే దానికి

అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి దృష్టి జిష్టి అయినట్లు **'ఇందూ'** అను శబ్దము **'హిందూ'** అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధిరౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించినవారికి **ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను.** ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక & ప్రబోధ సేవాసమితి**



# యజ్ఞములు (నిజమా-అబద్ధమా)

## ఇందూ (హిందూ) ధర్మములో సిద్ధాంతకర్తలు


అద్వైత సిద్ధాంతకర్త ఆది శంకరాచార్యులు
Birth : 509 BC - Death : 477 BC (32 Years) కేరళ


విశిష్టాద్వైత సిద్ధాంతకర్త రామానుజాచార్యులు
Birth : 1017 - Death : 1137 (120 Years) తమిళనాడు


ద్వైత సిద్ధాంతకర్త మధ్వాచార్యులు
Birth : 1238 - Death : 1317 (79 Years) కర్నాటక


త్రైత సిద్ధాంత ఆదికర్త : ప్రబోధానంద యోగీశ్వరులు
Birth : 1950 ఆంధ్రప్రదేశ్ (రాయల సీమ)


Author : The Only GURU of Three Religions

The Spiritual Emperor, Thraitha Theorem Originator

**Sri Acharya Prabodhananda Yogeeshwarulu**


**www.thraithashakam.org**